# మన గోపాలకృష్ణుడు





శ్రీమదాంధ్ర విద్యాపీఠ గోష్ఠి

(స్థానిక) శాఖ,

విజయవాడ,

1949. రు. 1—0—0

# పీఠిక



ఈ పుస్తకమునందలి పద్యములు చాల భాగము ఆంధ్ర రత్నము గూర్చి లోగడ పత్రికలలో ప్రచురింపబడినవి. కొన్ని నా కోరిక పైనను, విజయవాడ స్థానిక గోష్ఠిసంఘము వారి కోరికపైనను ఆయా కవులు మాకు ప్రసాదించినవి. వీటి నన్నిటిని కూర్చి "ఆంధ్ర రత్న స్మృతి" యను పేరిట ప్రచురించవలె నని సంకల్పించగా నేటికి యీ రూపమున వీని ప్రచురణకు సావకాశము లభించెను. ఈ పద్యములను మాకు బంపిన కవి శేఖరులకును, ఆయా పత్రికాధిపులకును మా గోష్ఠి సంఘము తరపున కృతజ్ఞత.

ఈ గ్రంథ ప్రచురణకు వలయు ధనమంతయు శ్రీ ఆంధ్ర రత్న గోపాలకృష్ణయ్యగారి షష్ఠి పూర్తి ఉత్సవ సంఘమునకై స్థానిక గోష్ఠిసంఘమువారు వసూలుచేసిన పైకమునుండి గ్రహింపబడినది. అట్టి దాతల జాబితా యీ గ్రంథాంతమున పొందుపరచడమైనది. వా రెల్లరకును మా యభివందనములు.

ఇట్లు విన్నవించు

విజయవాడ,
ది 26—8—1949.

శ్రీ మదాంధ్ర విద్యాపీఠ గోష్ఠి
స్థానిక శాఖకు గాను,
గుమ్మడిదల వెంకట సుబ్బారావు,
సంపాదకుడు.

# "ఆంధ్రరత్న"

# దుగ్గిరాల గోపాలకృష్ణయ్య షష్ఠిపూర్తి మహోత్సవ సంఘము.

## విజయవాడ.



౧ శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

౨ ,, అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు

౩ ,, జీబు వేంకయ్య నాయుడుగారు

౪ ,, పసుమర్తి శీతారామశాస్త్రిగారు

౫ ,, డాక్టర్ యస్. యస్. యాజిగారు

౬ ,, దోనేపూడి రామసుబ్బయ్య చౌదరిగారు

౭ ,, ప్రభల రాధాకృష్ణమూర్తిగారు

౮ ,, గుమ్మడిదల వేంకట సుబ్బారావుగారు (ఎడిటర్)



# విషయసూచిక



"ఆంధ్రరత్న"

దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు.

# మన గోపాలకృష్ణుడు



## తన్ను గూర్చి

(ఆంధ్రరత్నము తన్నుగురించి చెప్పుకొన్న పద్యము)

సీ. వేదాంతములతోడ వెక్కిరింతలతోడ
లెక్చర్లు సాగించు లీలనెవఁడు
లక్ష్య మొక్కటిలేక యక్షగానములతో
కాలంబు వృథబుచ్చు ఘనుడెవండు
చీరాల పేరాల చిన్నిగ్రామంబుల
దోసమెన్నక కొంపఁదీసె నెవఁడు
ఆంధ్రరత్నంబంచు నధమపక్షము సుంక్ర
కొండడై యరికోటిఁ జెండునెవడు

అట్టి గోపాలకృష్ణుని హాస్యసరళి
గోలకృష్ణునిఁ గాఁజేసి కొఱతఁదీర్చెఁ
గాక (పట్టి) పగ్గములుండునే "గాడ్డు" కైన
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!

## "ఆంధ్ర రత్న"

(చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి)

తే॥ గీ॥ కీర్తిశేషుఁడు గోపాలకృష్ణుఁ "డాంధ్ర
రత్న" బిరుదాంకితుండు రామదాసు
రామునకు హనుమయుఁబోలె రాజిలెనల
గాంధి శిష్యులలో నగ్రిగణ్యుఁడగుచు.

## "డేగ చూపు"

(వేదాంతం లక్ష్మీకాంత కవి)

సీ. శ్రీయాంధ్ర ప్రతిభావిశేషాంకపీయూష
మిప్పట్లనైన విస్మృతికిరాదె?
మధ్యరాష్ట్రంబులో మద్రాసులో గూడ
దొరయయ్యె నేడిటాంధ్రుండుకాడె?
అవధూత కాపాలి కాంగ్లేయ పండితుల్
తెలుగు పండితుగాదె తీసుకొనిరి?
సకల సాగర మధ్య సామ్రాజ్య పద్ధతి
ఆంధ్రి బ్రిహ్మర్షిగా నవతరించె!
గీ. ఇట్టి రాబోవు మహిమ మహీస్థలాన
ఆంధ్రిరత్నంబ! యెన్నడో అలమికొంటి!
సరస ధర్మార్థ కామ మోక్షములనేర్పు
విష్ణుసాయుజ్య! గోపాలకృష్ణ! వినతి.

# గోలపడిన మా గోపాలకృష్ణుఁడు

(వేదాంతకవి)

౧ తన రత్నంబెటు రాలిపోయినదియో! తత్పుత్రరత్నంబు గూ
ర్చి నదుల్ పెన్నఅదల్ వెలార్చియిలమూర్ఛిల్లెన్ మఱెవ్వాడు మే
లి నొసల్ చెన్నెసలార నీతెనుఁగుతల్లిం నేడు నోదార్చునో
మనగోపాలక రత్నవజ్ర ధరణీ మందార మాణిక్యమై ॥

౨ తేలికగా నొకండిల కుదించుచు కొండను నెత్తినట్టి గో
పాలునికంటె, నెన్నొ ధనభాగ్యపుఁ గొండలు కొండలున్న చీ
రాల నమాంత మొక్కఁడవురా యవలీలగ లేపినట్టి గో
పాలకరత్నమిప్డు కనవచ్చిన రాష్ట్రము రాకపోవునా!

దర్పిడిమఁగలట్టి దిట్టయయి రాయలనాటి తెనాలి రామకృ
ష్ణుఁడు పర్తివారి మూపుపయి చోద్యముగా చురుకైన చేతితో
నిడినవి మాయవచ్చు; మును పిచ్చటినేతల కాంధ్రరత్న కృ
ష్ణుఁ డిడినవేమి మాయ విక నూరుయుగాల భుజంగముద్రలై ॥

సభలో యుష్మదనర్గళైక కవితాచాతుర్య సౌందర్య ధీ
విభవాఖండ ఛలోక్తులీవిఁక విజృంభించగనే కోటి భూ
నభముల్ బల్ కరతాళశబ్దములతో నాట్యమ్ములంజేసి సం
క్షుభితక్షోణికి గుర్తిమ్మరించు పసిఁడిం గోపాలకృష్ణప్రభూ! ॥

కొమరుల్ నీపతెవరి యాంధ్రికిఁక మాగోపాలకా! రామ రా
జ్యము నెల్కొల్పు మహాత్ముడాంధ్ర ధరణీసామ్రాజ్యసంస్థాన భా
గ్యముగావించుచు నాంధ్రరత్నముగనిన్నెన్నట్టి నిల్పెట్టె; ఆం
ధ్ర మహానాయక! రామదండుసహకారంబెంత నీవిచ్చితో ॥

# పంచరత్నాని

(అమలాపుర పట్టణ కాంగ్రెస్ స్థాపకము)

వంశస్థవృత్తం:—

౧ సదాంధ్రరత్నా, ద్య నవీనభారతి
విచక్షణ, స్వీయజనుర్గృహస్థితే
పరోపకార ప్రియసేవనేచ్ఛయా
మహాన్మహీ దుర్భరభారహారకః

౨ శ్రీకృష్ణ గోపాలమహీ మహానహా
స్వచేష్టయాఽసంచయచేష్టయాన్వితః ।
మహాత్మగాంధి ప్రియరామవాసనో
శ్రీరామసేవాది నివారితశ్రమః ॥

౩ పాతుం సతోధర్మ మధర్మలోపనాత్
ప్రాదుర్భవామీతి వచః స్వకీయం ।
యథార్థ యన్మహి ముదం ప్రదేహి
త్వదాశ్రితేభ్యః కృపయాహ్యపారయా ॥

తోటకవృత్తం:—

౪ నిజసంవసథ స్థిత దుర్భగమా
నుషరాజిగతాం విపదం ప్రభిదన్ ।
తరురాడీ వయ స్తపనం శిరసా
సముహానతైః స్తవనీయగుణః ॥

సరిగిరిణీవృత్తం:—

౫ కృష్ణగోపాలహేనందయన్నన్వహం
మోదకైశ్చేష్టితైః స్వైః పరిజావత్రృజాః ।
సార్థయన్నామధేయం భువిస్వం విభో
నిర్వృతి ప్రాపణాదేధి వీతశ్రమః ॥

# రత్నచ్యుతి

(జి. జాషువ)

౧ మ. ఒకరత్నంబును చేతఁబట్టుకొని యూ-రూరం బ్రదర్శించి, పా
లక ఖండాంతర సీమలెక్కి- నిజవా-ల్లభ్యంబులూరించు సా
ర్థకతాదివ్యకుటుంబినీమణిమదాం - భ్రష్మాలతాతన్వియా
యొకరత్నంబును బారవేసుకొనెన-య్యో! ఎట్లుశాంతించునో

౨ చ. రతనముజారిపోయినది - రా! సుకుమారకుమారులార! మీ
యతనములింకసాధ్యపడ - వాంధ్రధరాతల మెల్లఁజిక్కుటం
ధతమనవార్ధిలోమునిఁగె - నా? మనగాంధికిఁజెప్పినారొ లే
దొ? తెలుపుఁడంచుఁగేకలిడు-చున్నది చూచితిరే ధరాసతి॥

౩ సీ. మహితస్వరాజ్యోద్య - మముపోరు కెదురెక్కి-
మడమదిప్పనివీర - మండనుండు
గాంధిభక్తునిజిహ్వా - కాఖనిం గదలించి
రత్నంబుఁగొన్నసా - ర్థకపురుషుఁడు

--లణ--

వాసికెక్కిననేర్పు - మూసలోగుండె రా
　　　　ల్గరగింపఁజాలు న - ఖండవక్త
పరుల వంచించుట - కరిభక్తులకునల్గి
　　　　'కొరడా'లు సృష్టించు - గుణవిధుండు

దినముగడచుట కింట బ - త్తెంబులేక
నిత్యసంతర్పణంబులు - నెఱపు భక్తుఁ
డాంధ్రవైభవధ్వజమూడి - యవనిఁగూలఁ
గూలిపోయెనే? మారత్న - గోపమూర్తి!

౪ సీ. కృష్ణవేణీ తరంగి - త తరంగములందు
　　　　దేశీయగానంబు - దిద్దినావు
జాతీయపౌరుష - స్వచ్ఛందరక్తంబు
　　　　చీరాల రణసీమ - జిందినావు
పులిని గ్రుద్దుకుచంప - గల దేహదార్ఢ్యంబు
　　　　మును బందిలో ధార - వోసినావు
శతకోటి మన్మథ - స్వర్ణసౌందర్యంబు
　　　　పీడరోగమున - కర్పించినావు

పలుకు పలుకున హాస్యసం - పదలు గురియు
సహజ వైదుష్యమునకు ని - చ్చలునుబొంగు
నాంధ్రసోదరలోక మ - ల్లాడ నపుడ
స్వర్గ మెక్కితివేల? గో - పాల నీవు!

౧౮ ఉ. ముప్పదియెన్మిదేండ్లు నిను-మోసిన యాంధ్రధరాపవిత్రికిం,
గొప్పున దిద్దిపోయితివి - కోమలకాంచనదామకంబు నీయొ
ప్పును సత్కళాప్రతిభ-యుం గలకొండొకయాంధ్రవీరుడిం
కెప్పటికింజనింపగలఁ- డే? జనియించినయేని దక్కునే?

౧౯ మ. నినుఁ గామించిన కీర్తిగోపికలు నీ-నిర్యాణ వార్తాహతా
ఘనబాణంబున రొమ్ముగ్రుద్దుకొని నీ-గంభీరగాథావిమో
హన బృందావన వీధులంబరుఁగులే-యంజొచ్చె, నీశోకవా
హిని నేరీతిఁదరించునో తెలియదో-యీ! రత్నగోపాలకా!

౨౦ సీ. ధనవంతమైన లం - డను పట్టణమునందు
తెలుగునేలకు పన్నె - దెచ్చినావు
స్వాభిమానముఁజాటు - వంగరాష్ట్రమునందు
గౌరవాభ్యుదయంబు - గాంచినావు
రాజమహేంద్ర పు - రాన యల్. టీ. దాక
సిరిమీఱఁబాఠంబు - జెప్పినావు
ఒకయుపన్యాసంబు - నకు నూఱుఁబదునార్లు
గా కట్నములు మూటఁ - గట్టినావు
పెదవిఁగదలించి నీవు న - వ్వింపనట్టి
భారతీయుఁడు నొకతెల్ల - వాఁడులేఁడు
యిట్టిచాతుర్య జలనిధి - వింతలోన
రూపుమాసితివే రత్న - రూపకృష్ణ!

౭ సీ. బహువిధంబుల గుక్క - బట్టి యేడువఁజొచ్చె
సగమైన నీదుదీ - కొకుమారి
పాడెకట్టెలమీద - బడి మొత్తుకొనసాగె
దిక్కులేని భవత్సతీలలామ
హృదయంబు బ్రద్దలై - పొదల దిక్కులుసూచె
మితిలేని నీబంధు - మిత్రకోటి
ప్రకృతిసుందరవైభ - వంబేది కళదప్పె
క్షేమాంకమైన నీ - రామనగరు

దాసువోయిన యలకల్కా - తాపురంబు
పగిది గుంటూరుపురి శోక - భరితమయ్యె
నయ్యయో! నీ - యాగమమున
స్వర్గపట్టణ మానంద - భరితమయ్యె ॥

౮ సీ. భౌతికశారీర - పంజరంబేకదా?
చితిమీద దగ్ధంబు - జేసినావు
క్షణభంగురంబైన - సౌందర్యమేకదా
మృత్యుదేవతకు న - ర్పించినావు
కంటికిం గనరాని - కంఠస్వరమెకదా
కాలవాహినిలోన - గలిపినావు
యూటాడిజారునా - యుద్ధనమేకదా
వెఱ్ఱిబ్రహ్మమొగాన - వేసినావు

మరణధాటికి జరకు త - త్తరముపడని
తతయశఃకాయ మిప్పుడు - తాల్చినావు
యిపుడు జీవించియున్నాఁడ - వింద్రసభకు
రత్నదీపఁబులేని కా - అంత దీప్తి.

(భారతి)

# చతుశ్శ్లోకాని

(వేదుల వేంకటచయనిశాస్త్రి)

౧ శ్రీ దుగ్గిరాళాన్వయ వార్ధిచంద్రో
గోపాల శ్రీకృష్ణ సహోదరైస్సదా
అస్తంగతో సిత్వ మిదం శరీరం
పరోపకారార్థ మితీరయిత్వా॥

౨ ఆంధ్రదేశస్థ మర్త్యానాం వార్తాం బోధయితుం ముదా
తిలకాది సమీపం త్వం హిం గతోసి ఇతోరరం॥

౩ దైవబ్రాహ్మణ భక్తిమన్మథ రసాదత్యంత మాధుర్యవాక్
సర్వాశాపరిపూర్ణ కీర్తిసరణే భూతాదికారుణ్యమత్
గిర్వాణాది సమస్తవాక్తతినిధేత్వం మృత్యు సంపీడితః
దుఃఖాగ్నినిపీడితాన్ ద్రుతతరం కృత్వాసి స్వర్గం గతః॥

౪ ఆంధ్రదేశస్య దారిద్ర్యం వర్ణితుం కే నశక్యతే
త్వత్తుల్యా భారతీయాస్తు మృత్యునా పీడితా మృతాః॥

(ఆంధ్ర పత్రిక)

# ఆంధ్ర కృష్ణ వియోగము

( దీవి లక్ష్మణాచార్యులు, పెదపులివఱ్ఱు )

౧ అనుపమధిషణా విరాజమానో
మృదు మధురోక్తి విమోహిత ప్రపంచః
తృణమివ కలిత ప్రభుత్వసేవ
స్సఖలు. గతోదిన మాంధ్రదేశ వీరః॥

౨ జాతీయాశయ మాదరేణ బహవోంగీకుర్వతేఽధాపియే
కేచిత్కార్య పరాభవంతి విరళా స్తత్రాపియే త్యాగినః
త్యాగేచా చరణే ప్రసిద్ధ పురుషః కోవేతి చర్చావిధౌ?
వాద్యోఽయం హాల దుగ్గిరాలకులజః గోపాలకృష్ణస్సుధీః॥

౩ లీలా కృష్ణ వియోగేన నిర్విణ్ణా గోపికాయథా
ఆంధ్ర కృష్ణ వియోగేన నిర్విణ్ణామానవా స్తథా॥

(ఆంధ్ర పత్రిక)

# గోపాలకృష్ణ గానము

( బలిజేపల్లి లక్ష్మీకాంత కవి )

చాలుం జాలు సదా వృథావ్యసన కష్టంబేటికో? సాగరా!
గోలంబెట్టకు నీతరంబగునె మా గోపాలు సంగీత లీ
లాలోల స్వరసుప్రసార మధురవ్యాహార గంభీర ధా
రాలావణ్యగతుల్ జడాశయుల కర్థంబౌనె యేనాటికిన్ ?

(గోష్ఠి)

# నవరత్న మాలిక

( వెంపరాల సూర్యనారాయణమూర్తి )

శ్లో॥ పాయాచ్ఛ్రీరఘునాయకః కరుణయా భక్తాగ్రణిం ధీమణిం
చీరాలోద్ధరణాత్తకంకణకరం, గోపాలకృష్ణాహ్వాయం।
యో వాణీలలితక్రమై రుదలిఖత్సర్వాంతరంగేషు సత్
స్వార్థోత్సర్జనదేశభక్తికలనాచిత్రాణి చిత్రాణ్యపి॥ ౧

సీ. స్వాగతంబయ్య ! కారాగార వాసవి
శ్రాంతాత్మ ! నీకుఁజీరాలరత్న !
సేమమే ! యాశాంతసీమానవరత వి
రాజద్యశోవాస ! రామదాస !
కుశలమే ! సురగవీకూలంకషధిషణా
ప్రాభవోపేత ! పేరాలనేత
భద్రమే ! గాంధీశుభంకర మార్గసం
చారప్రమోద ! నిశ్చలవినోద !
గీ. సంతసమె ! నిచ్చలును స్వదేశప్రబోధ
కార్యధృతకరకరణ ! కరుణఁగాకి
నాడ కరుదెంచి మమ్ము నానందమునను
దేలిచిన దుగ్గిరాల గోపాలకృష్ణ! ౨

శా॥ అన్నా! చాతక మంబుదాభిగమనం బాసించునట్లే నినుఁ
గన్నారం గనగోరు కాకపురలోక వ్రాతముల్ చెంగలిం
పన్నేఁ డిచ్చట దర్శనంబొసఁగి, మామాకోర్కెలుందీర్పు నీ
కు న్నిత్యాయురరోగతల్ గలుగుతన్ గోపాలకృష్ణాహ్వయా! ౩

శా. శ్రీకాంతా వసతిస్థలంబులగు నా చేరాలపేరాల ల
య్యాకాశంబున నెత్తిచూపియసహాయాధ్వంబు దేశంబునం
దేకాకారతఁజాటి, "బందెమనగా నింతేసుఁడీ" యంచు ధీ
రాకారమ్మునఁ దెప్పవచ్చిన మహాత్మా స్వాగతంబియ్యదే! ౪

5 ఉ. రత్నము సానఁబట్టిన గరంబు వెలింగెడురీతి నాంధ్రపుఁ
రత్నమవైన నిన్నును జెఱన్గొని రాపిడిపెట్టుటన్ జుమీ
నూత్న వికాసము గని మహోజ్జ్వలవై కనుపించుచుంటి; నీ
యత్నము సాగనిచ్చుచిసహాయమొసర్చుచునీదురాముఁడే! ౫

శా. పాండిత్యంబొకహరాణమందెయొహొ?గీర్వాణాంధ్రభాషాద్వయిన్
నిండన్ గాంచితి గానమున్ గవితయున్, నిర్మించు ధీశక్తులున్
బండెన్ గాదె! యివేమిలెక్క? యఖిల వ్యాహారవేద్యంపు వె
వ్వండీడౌనని వ్రేల్మడంచి పచియింపన్ రామదాసాంకితా! ౬

మ. సరసంబే భవదీయవాణి కుపమానాజాత్యమౌనే? నిరం
తర భంగోద్గమ ఘుం ఘుమం ఘుమ నినాదప్రౌఢ గంగానదీ
వరటానాట్య ఝణం ఝణ ధ్వనులు; దివ్యత్కోకిలా కాకలీ
స్వర సంఘాత ఘలం ఘలాయతసుధాసారంబులో కృష్ణుడా! ౭

చ. కుబుసమునూడ్చు త్రాచుగతి ఘుమ్మన బందెవిడంగవచ్చు ని
న్నుఁబరమమోదమందఁగఁగనుంగొనినారమిఁ కెన్నడొక్కొమా
దు బులుపుసాంబమూర్తిఁ గనుదోయికిఁబందువుగాగజూచుటల్
గబగు నాంధ్రమాత తలసూపుడు,చంద్రుడుమీరరేకడా! ౮

వ. అమృతపు బిందువుల్ చివికినట్లుల పువ్వులవానరీతి మ
త్త మధుకరారవంబువలె దంత్రిరవంపు విధాన మంచిము
త్యములటులొప్పు, గానకవితంబగు నీమృదువాగ్విలాసముల్
మము(దనియించుగాకిదెనమస్కృతి(గైకొనుమాంధ్రరత్నమా

(కాకినాడ జాతీయ విద్యాలయ సమర్పితము)

# ఆంధ్రరత్న గోపాలకృష్ణ

(కాంచనపల్లి కనకాంబ)

౧ ఆంధ్రజాతీయ విద్దెల కనవరతము
పాటుపడిరె నీవలె నిట్లు భరతభూమి
రత్నగర్భ ని(గనుట సార్థకమయ్యె
నాంధ్రరత్న గోపాలకృష్ణా నిజమిది॥

౨ చెప్పునది చేయునది చింతజేయునట్టి
దేకముగ నుండు శీలము దేరికగును
పారమార్థికమున వ్యవహారమునకు
నాంధ్రరత్న గోపాలున కయ్యెగాక॥

౩ రెండును రెండుత్రోవలు ధరిత్రిని ప్రాచిప్రతీచియందు రం
డుండెడు భేదము(దెలియ నో మహనీయప్రతీచికేగి భూ
మండలమందు హైందవులెమాన్యులటంచు నెఱింగియేకదా
దండిగ తత్వబోధముల ధర్మము లెస్స నెఱుంగజెప్పితో॥

౪ వీరులు సత్కవుల్ బుధులు విజ్ఞులు ధీరులు సంద్రుగాని సీ
దారి స్వధర్మదీక్షగొని తద్దయు నిట్టు లుపన్యసించిరే
పోరిరె జాతితత్త్వమును బూర్ణత నిల్పగ జీవితాంత మీ
తీరున నీ వొకండవిటు తీర్చితి తల్లిఋణంబు సోదరా॥

౫ వేదమువీడి శాస్త్రములవీడి పురాణములల్ల కాళిదా
సాదుల కావ్యసంతతికి నన్ని జలంబులు విడ్చి వట్టి సం
పాదనకై స్వధర్మమును బాసిన నాయకపాళియెల్ల మీ
మాదిరి ధర్మరక్ష నిటు మాన్యతజేయ ఫలంబు గాంచమే॥

# ఆంధ్రరత్న పంచరత్నములు

(దోమా వేంకట స్వామిగుప్త)

సీ॥ భారతాంబా దివ్య పాదారవింద మ
రంద మోదిత హృదిం దిందిరుండు:
కరుడు గట్టిన యాంధ్రధరణీతలను భక్తి
దీక్షాప్రకార విధేయమూర్తి
శ్రీరామచంద్ర సమారాధనాదశ—
యుక్త ద్వితీ యానిలోద్భవుండు
నిష్కపటాశయ - నిష్కపటోక్తి ని
ష్కపట క్రియాంచిత సద్యశుడు

గీ॥ అత్ర గంగానదీ పరిశుభ్ర లసద
భంగ భంగభంగీ ప్రసంగి ప్రభావభాగు
పన్యసన విన్యసన సుధావర్ష బహుళ
ధన్య పజ్జన్యు నాంధ్రరత్నముఁ దలంతు॥

సీ॥ శ్రీ దుగ్గిరాల వంశోదార వారాశి
పరిపూర్ణ చంద్రబింబం బనంగ
శారదా పాద మంజీరస్వనోప మో
పన్యాస విన్యాస ధన్యుఁ డనఁగ
వైణవారావ ప్రభావ భావంగతు భావ ద్వి
తీయ గోపాలుఁ డనఁగ
లుంగీ - తెలంగీ - ఫరంగీ - ఫిరంగీ సు
సంగీత భంగీ ప్రసంగి యనఁగ

గీ॥ పరిచితి యొ కింత - ఇంక సేవన మొ కింత
వినికి యింతయు- నింక- దర్శన మొ కింత
యైన వారికి గోత్రసమన్వయముగ
తెలియు గోపాలకృష్ణుండు తెలుఁగు మేటి॥

సీ॥ పుట్టిన దాదిగాఁ బున్నెమే దాదిగా
దేశమాతపయి భక్తిం దలిర్చి
తన వారుఁ బెర వారు ననక యెల్లరిపైన
సమ బహుళప్రేమ సరణిఁ దనరి

పై పతారంబు-లోపల లొత్తారముగాంధ్ర
బండారముం బట్టి బైల్వెలువుచు
"పెరుమాళ్లపై" గాక "పులిహోర" భక్తి రా
వారికిఁ బ్రక్కలో బల్లె మగుచు

గీ॥ "చుఱుకు" మని నసాళముదాఁక సోఁకు టీకు
గల యుపన్యాసముల మేల్మి విలసదఖిల
దిగ్వలయ కీర్తి నొందిన ధీరు-దుగ్గి
రాల గోపాలకృష్ణుని లీల నెంతు॥

సీ॥ "అరవ" జనంబు నీ దరిఁ జేరినంతనే
యరవ జనం బయి యఱవ కుండు
నెఱి జగన్నాథపండితరాజ వనిపింతు
వమరఁ ద్వత్కవనంబు నాలకింప
రామదండెంతో నిరామయంబుగ నడి
పిన నీవు మారుతి వనఁగఁ జేయు
ఆ శంభు నేని "ఛీ"యన్న-"ఛీ"యను నీ ప్ర
తికిఁ గొండ యేది వర్తిల్లు సాటిః

గీ॥ నీకు నీ నిర్మలతకు నీ నిస్తులతకు
నీ యుపన్యాస ఘన ధోరణికిని నీదు
విమల దేశభక్తికిఁ బదివేల నతులు
భవ్యతమ ! దుగ్గిరాల గోపాలకృష్ణ॥

సీ॥ నీ విమర్శనముల నెఱ వాఁడితనము కు
క్షింభరావళి పొట్టఁజించి వైచు
నీ యుపన్యాస నిర్ణిద్రపర్జన్య గ
ర్జంబరారి "పరారి" సల్పు వడిని
నీ కవనం బన్న నాక వనం బౌచు
నీకవనం బనిపించు నొరుల
వేనూర్పదార్ల నర్పించిన వార్ని మృ
దూక్తికి వెల యింత యొనరుఁ దెల్ప
గీ॥ అందమై మృదు హాస్యరసాలపనము
లందు నమృతమ్ముఁ జిమ్మ నీ యాకృతి నొక
యపుడుఁ గనువారి యాత్మల నధివసించు
భవ్యు నిన్నెంతునయ్య! గోపాలకృష్ణ.

## "ఆంధ్రరత్న" స్మృతి

(చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి)

ఉ॥ భౌతిక జీవనంబున నుపాసనఁ జేసిన శక్తి గర్భమం 2
దాతతుఁడై జనించిన మహాత్ముని కృష్ణుని కీర్తికాయమం
దేతము పెట్టుగా నరువదేడులు పూరితియయ్యె- తన్మనీ
షాతతకాంతులన్-తెనుఁగుసంతతి యాతని సంస్మరింపఁగన్॥

సీ॥ పలుకు పళ్ళేన? నూటపదియారు రూపికల్ 3
వెండి పళ్ళెమునఁ గన్పింపవలయు
రాగమాలాపించెనా? గబాగబ వచ్చి
శత్రువైనను సేవసల్పవలయు

పద్యమ్ము చదివెనా ? ప్రజలు మోహముపేరి
వినువీధి రిక్కలై వెలయవలయు
గేయమ్ము పాడెనా ? కేవల లుబ్ధుండు
నిలువుదోపిడి యిచ్చి కొలువవలయు
సీ॥ పిలచు పిల్పునఁ గఠినంపు శిలలుసైత
మెగిరి తెక్కలతో వెంటఁ దగులవలయు
వానియందలి ప్రతిభ చెప్పంగఁ దరమె ?
దైవతుల్యుండు- ఆంధ్ర రత్నమ్ము మాకు॥ —౨

ఉ॥ క్షయలో దేహముఁ బాసిపోయిన తనూసౌందర్య మీనాటి
కవ్యయమన్నట్టులుగన్పడుఁ బ్రజలనాహా!ఆస్వయంవ్యక్తిలో
బయలై ; ఆంధ్రికిఁ గుందనంపుఁదొడవౌ వాగ్దేవి యీనాటికిఁ
జయగీతంబులు పాడుచున్నయది- విశ్వప్రేమసంబద్ధమై॥ ౩

సీ॥ గండుఁగోయిల గొంతుకలకు జీవమువోయు
కొదమ పిల్లనఁగ్రోవి గొంతువాని
అసహాయ శౌర్య ధైర్య స్థైర్యముల కాట
పట్టువై బ్రదికిన బ్రదుకువాని
ప్రతివాది భీకరత్వమున వాతలుబెట్టి
ప్రజల మన్ననఁగొన్న వాక్కువాని
రామదండంబుఁ జీరాల పేరాలలం
దతి మానుషముఁ జూపినట్టి వాని

గీ॥ మృదువు తప్పని హాస్యసంపదకు నొదిగి
యెంత మేధావినిఁ ధిక్కరించువాని
రామునకు దాసుఁడౌ ఆంధ్రరత్న దుగ్గి
రాల వంశ్యునిఁ దలఁతు గోపాలకృష్ణు॥

ఉ॥ ఏ దురదృష్టమో పొటమరించి తెనుఁగులలోనఁ బుట్టినా
డా దిగధీశ్వరత్వమున కర్హతగల్గిన జెట్టి; అంతియే
కాదనుకొన్న - ఆతనికిఁ గల్పనఁజేసిన చిహ్నమేది? త
త్స్వాదువచోఽమృతంపుఁగలశమ్ములవేవి? వచింపుఁడీజనుల్॥

# ఆంధ్రరత్న గోపాలకృష్ణుడు

(తుమ్మల సీతారామమూర్తి చౌదరి)

సీ॥ ఆంధ్రగీర్వాణ పురాణాది సాహిత్య సా
మ్రాజ్యంబు నేలిన రాజ రాజు
ప్రాచ్య పాశ్చాత్య సంబంధి వేదాంత వా
రిధి మధించిన బుధ ప్రథిత యశుఁడు
బౌద్ధ హిందూ క్రైస్తవ మహమ్మదీయాది
మత మర్మములఁగన్న మహితగుణుఁడు
వివిధ నాగరికతా విజ్ఞానములఁ బరి
శోధించినట్టి సంశుద్ధమూర్తి

గీ॥ దీక్షవిడువని భారతదేశభక్తు
డిద్ధచరితుండు గోపాలకృష్ణుఁ డాంధ్ర
మాతృకా గర్భరత్నంబు మనల విడిచి
దివికిఁ జనెనయో! యెట్టి దుస్థితి ఘటిల్లె!

సీ॥ ఎవ్వాని మధుర వాగింద్రియంబున యందు
నవరసంబులు చింది నాట్యమాడు
ఎవ్వాని మోహనాకృతి గాంచి లోకంబు
మేలు, మేలనుచు నెమ్మేను మఱచు
ఎవ్వాని ప్రతిభ దా నెల్ల దీవులయందు
స్వేచ్ఛావిహారంబు సేయుచుండు
ఎవ్వాని వాగ్వాద మెంతేని హృద్యమై
ప్రతివాదులకు భయప్రాప్తిఁగూర్చు
గీ॥ అతఁడు భారతమాతృ పాదారవింద
ఘటిత దుర్దాస్యశృంఖలాఖండన ప్ర
చండ ఖండన వీరమార్తాండు డాంధ్ర
రత్న మెటకేగె నకట, చీరాల విభుడు?

సీ॥ పిలిచినంతనె తల్లి పిలుపు నాలించి "అ
మ్మా, యేమి సెల" వంచు నడిగినావు
రాజకీయోద్యోగరాజంబు నంతయుం దృ
ణప్రాయముగ వీడనాడినావు
మహనీయులగు లోకమాన్యాదులఁ దలంచి
కంకణంబునుఁ గేలఁ గట్టినావు
తెలుఁగుసీమలనెల్లఁ దిలకించి దేశదు
స్థితుల వర్ణించి బోధించినావు
గీ॥ ప్రస్తుతాంగ్లప్రభుత్వ లోపములు నెల్లఁ
జాటి స్వాతంత్ర్యబీజముల్ నాటినావు
నేఁడు విశ్రాంతికై మమ్ము వీడినావె?
ఆంధ్రరత్నమ! శాంతితో నలరుమయ్య! (ఆంధ్ర పత్రిక

# యమునా సాంత్వనము

( కీ॥ శే॥ బసవరాజు వెంకట అప్పారావు )

భైరవి - త్రిపుట.

౧ ఏలా పాడే నింక
యమునా కళ్యాణీ * నే
లీలామానవుడు - గోపాలుడు - లేడాయె॥ నేలా॥

౨ బంగారుసీమలో ♦
చెంగలించేవేళ
పిడుగులాటిమాట - వినిపించినా రయ్యో॥ ఏలా॥

౩ చెడువార్త వినగానె
చెవులు గింగురుబోయె
నెంతదించుకున్న - గొంతు పెగలదాయె॥ నేలా॥

౪ వెన్నెలకు తోడు మా
వేణూ గోపాలుడు
కన్నులకు పండువుగ - కనుపించకుంటే నే॥ మేలా॥

౫ ఏలా పాడే నింక
యమునా కళ్యాణీ - మా
లీలామానవుడు - గోపాలుడు లేడాయె॥ నేలా॥ (భారతి)

---

* యమునా కళ్యాణి గోపాలకృష్ణుని అభిమాన రాగము.

♦ "బంగారు సీమ" = కోలారు గనులు.

# శ్రీ గోపాలకృష్ణస్తుతి

(నారు నాగనార్యకవి.)

ఆంధ్రరత్నము ! వీరయోధాగ్రగగన
రత్నమాంధ్రపురంధ్రి మూర్ధన్యదీప్య
మానమకుటస్థరత్నంబు మా, యభాగ్య
దశను గనరాని తెరువునఁ దప్పిపడియె! ౧

కం. విష్ణుపురిఁ జేరె రాధా
కృష్ణుఁడు, శ్రీ దుగ్గిరాల కృష్ణుఁడటకె భ్రా
జిష్ణుగతిఁ జనియె నాంధ్రక,
వోష్ణాశ్రువు లురలిపాఱ నుచ్ఛ్రితచింతన్. ౨

తే. డార్జిలింగున దివిజేరు దాసుగారిఁ
గాశిఘట్టాన నగ్ని సంస్కారవిధులు
నేయుభంగిని గుంటూరు జీవమొదల
రామనగరాన సంస్క్రియల్ రహిఘటిల్లె. ౩

సీ. చనవిచ్చి మాటాడినను నవ్వటాలయే
గాని కోపంబు నుంతేనిలేదు
మెఱమెచ్చుగాఁ బ్రజాపరిపాలనేచ్ఛయే
గాని కోరిక లేశమేనిలేదు
వాయివిప్పిన సన్యపక్షమేన్ వరివస్య
లగుదుర్రే గాని వేఱుగుటలేదు
దేశహితైక సత్కృషిఁ బ్రబోధించునే
గాని స్వార్థంబింత పూనలేదు

త్యాగమేకాని లోలుపత్వంబులేదు
ధైర్యమే గాని కాతరత్వంబులేదు
ఆంధ్రవీర మహోద్భుతవ్యక్తివీవె
పరమపూజ్యా! దుగ్గిరాల! గోపాలకృష్ణ! ౪

సీ. నీ దేశసేవ కెన్నియొ చెప్పఁగానేల?
చీరాల పేరాలవారె సాక్షి
నీ ధైర్యపటిమ కెన్నియొ చెప్పఁగానేల?
కోర్టు వాఙ్మూలమే గొప్పసాక్షి
నీ రామభక్తి కెన్నియొ చెప్పగానేల?
రామదండొకటి తీవ్రమగుసాక్షి
నీ కవిప్రౌఢి కెన్నియొ చెప్పఁగానేల?
మాటాల్లుగానెడి నీ సుతులెసాక్షి

గీ. తరని యభాగ్యవశఁగాని తెచ్చుకొనుటె
భోగభాగ్యుఁడవనుటకు భూరిసాక్షి
అమలుఁడనిపగు నీకు సాక్ష్యములవలెనె?
భంజితాత్మీయతృష్ణ! గోపాలకృష్ణ! ౫

సీ. ఓ రామదండునే యారామముననిల్పి
యేగితో మాకెరిగింపకుండ
నీ రామనగర నిర్మాణ కార్యక్రమె
ట్లెంచితో మాకు బోధించకుండ
నీ యనుభూతవిద్యాయుక్తి రఘురామ
సేవామహిమ మాకు జెప్పకుండ

నీ తెల్గుజాతి పునీతులౌటిటులంచు
నిదమిద్ధమని నిర్ణయించకుండ
గీ. వల వలని యేడ్చు దుర్గమ్మవంకనైన
జూడక హుటాహుటిగ నీదు జాడఁబట్టి
చనితివా! మిత్రశోకంబు స్వాంతమందు
బాలనము సేయ కకట! గోపాలకృష్ణ! ౬

ఆంధ్రరత్నము; శ్రీరామ హారపతక
మధ్యభాసితరత్నమై మలయుఁగాత
స్వీయసర్వస్వమును దేశసేవకిడిన
వారియాత్మకు శాంతి చేకూరుగాత! ౭

(ఆంధ్ర పత్రిక)

# ద్విపద

(కీ॥ శే॥ బసవరాజు వెంకట అప్పారావు)

కాలచక్రము గతి గడిచి తెనుంగు।
భావిభాగ్యమ్మెల్ల పండినవెనుక।
ఆనాటి కెవరైన నడుగకపోరు।
గోపాలకృష్ణుడే గోష్ఠివాడంచు?
భావ్యవశమ్మైన భావికాలాన।
అమృత తుల్యమ్ములు నతిభావచరిత।
ములునైన నాగీతముల విని నంత।
గోపాలకృష్ణుని గొప్పదీపించు॥

# "గోపాలకృష్ణ మంత్రి"

(వెదుమూడి శేషగిరిరావు)

గీ॥ ఆంధ్రులెవ్వనికిచ్చిరో "ఆంధ్రరత్న"
మనెడు సార్థక బిరుదంబు అరయ రామ
దండు నెలకొల్పినట్టి యుద్ధండు డెవఁడో
పరగ నా దుగ్గిరాల గోపాలకృష్ణ
రాయలకు శాంతి నిచ్చుత రామవిభుడు॥ ౧

సీ॥ కాంగ్రెసు మహాసభా కార్యదర్శిపదంబు
నాంధ్రులలో గాంచెనాద్యుఁడితఁడె
నిర్భయత్వంబున నెఱి నాత్మగౌరవ
రక్షణంబున మిన్న యరయ నితఁడె
శ్రీరామనగరంబు చెలువుగ నిర్మింపఁ
బూనిన భక్త సంపూజ్యుఁ డితఁడె
వాగమృతంబును వర్షించి ప్రజలను
దనియింపఁ గలిగిన ధన్యుఁడితఁడె
పరగ నీ రామదాసు గోపాలకృష్ణు
నాత్మసంపూర్ణ సచ్చిదానందమయతఁ
గాంచి యవ్యయపదమునఁ గ్రాలునట్లు
భక్తవత్సలుఁడీ రామభద్రుఁ డెలమి
బ్రోచుఁ గావుత ! నిరతంబు పూర్ణకరుణ॥ ౨

గీ॥ అన్యదేశంబులో విద్య నభ్యసించి
అఖిలభారత నాయకుండనగఁ దనరి
ముప్పదేండ్లకే భూలోకమును త్యజించె
కీర్తికాయుండు గోపాలకృష్ణ మంత్రి॥ 3

—ఆంధ్రపత్రిక.

# ఆంధ్ర రత్నస్తుతి

( వడ్డాది సీతా రామాంజనేయులు )

సీ॥ త్రిగుణంబు లట్లు వింతగఁదోఁచుఁగద మర్త్య
గణములయందు భాగత్రయంబు
కేవల స్వార్థంబె భావించి సంతతం
బపజయంబే కాంచు నధమజాతి;
యడ్డువచ్చెడుదాఁక ననవలఁ గొనిపోయి
నడుదారి మధ్యముల్ విడుతు; రంత
నుత్తముల్ తమతోడ నురుదీక్ష నినుఁబోలె
నార్తులఁగొని జయమందుకొందు;
గీ॥ రహహా! నీవు సామాన్యుండవా? మహాత్మ!
రామసేవాపరాయణోద్దామ రమ్య
భావఖని; వాంధ్రరత్న గోపాలకృష్ణ!
నిన్నుఁ గోల్పోయి మేమెట్లు నెగడు టింక?

చ॥ పుడమియందు యభ్రమందు ననమాన వికాసత లోకబంధుఁడై
తనరుచు రత్నగర్భతఁ సువాత్తముదం బొనఁగూర్చు మిత్రుఁడ
మ్మణిపదవాచ్యుఁడై పరఁగు మంజులరత్న నికేతనంబు నం
దొనరఁగఁ జేయు పెంతయును నొప్పిద, నీవును నాంధ్రరత్నమై
మొనయుచు వితంబునఁ బరమపూరుష రత్ననికేతనంబు నీ
కనుపమఁ జేరఁ; బ్రాణినిచయం బెటులుబ్బునొ యందుఁ జేయు తే
పనుఁగొన నై జమౌఁగప; సుఖంబును గంటిమి నీవు; కాని తీ
రని తమిరచ్చటత్ పడి ధరాస్థలిఁ గ్రమ్మెను ముమ్మరమ్ముగన్

గీ॥ కర్మయోగమార్గమున నుత్కంఠనేఁగి,
కార్యశూరత కొలువడి, కలఁతనొంది,
తత్తరంబున నట్టిట్లు తప్పిజారు
ప్రజలఁ జేయూఁత నొసఁగి సంభ్రమము మాన్పు
నాయకశిఖామణివి నీవు గేయచరిత!
యమరపురి కీవు తరలుట నార్తరవము
నిర్భరమ్ముగ రోదసి నిండిపోయె
నార్యచిత్తరంజనయత్న! యాంధ్రరత్న!

క॥ పంతమున నాంధ్రమణిని హ
రింతురె సురలార! కల్పవృక్ష సురభులన్
చింతామణియును జాలవె?
చింతామణిస్థలిగ మమ్ముఁ జేయఁగవలెనే?

సీ॥ మహిత భూషణమైన కొహినూరు రత్నమా
తెలిదీవి దొరల స్వాధీనమయ్యెఁ
బ్రాచీన భవనాళిఁ బరఁగు రత్నంబులా
పరవణిక్సంఘాళి పాలఁబడియె
నవనిధాన ప్రభా వళులు రత్నంబులా
కడు నగాధాంభోధి నడఁగిపోయె
క్షితికిఁ జైతన్యమిచ్చెడు వియద్రత్నమా
కాలపూరుషునోటఁ గూలుచుండె

గీ॥ నిన్నుఁ గనుఁగొనియైన శాంతినివహింపఁ
దొడఁగు మాయాశలన్నియుఁ ద్రుంగిపోవ
విష్ణుఁడో, భ్రమజెందిన వేల్పుగమియొ
యకట! హరియింపనోపు నిన్నాంధ్రరత్న!
నిక్కముగ రత్నమాకర్షణీయముకద !!

సీ॥ రామదాసుండవై క్రాలుట యానాఁటి
విష్ణుభక్తిస్ఫూర్తి పెంపుఁ దెలుపఁ
గృష్ణుండవై ఖ్యాతినెసఁగుట నాఁటి జ
గన్మోహనత్వ వైఖరినిఁ దెలుపఁ
గవికోకిలంబవై ఘనతఁగాంచుట నాఁటి
నవరసజ్ఞత్వ గణ్యతను దెలుప
సభల కెక్కుటనాఁటి సంస్థానపండితో
త్కృష్టవచశ్చమత్కృతినిఁ దెలుపఁ

గీ॥ ప్రజ్ఞలందునఁ, బటుహాస్యరసమునందు
వెరసి రామకృష్ణుండవై వెలసితీవు
కాని, రాజకీయ విమర్శనానుభూతి
నాఁడుకొఱవడనది తీర్పనేఁడునెగడి
తాంధ్రగోపాల మూర్తివై యాంధరత్న!

గీ॥ కలరు గోపాలనామకుల్ పలువు రెందుఁ;
బసులఁగాడఁ బోవలసినవారె వారు;
వారికృష్ణచర్యలు నగుబాటై; హంస
హంసయే, కాకి కాకియే; యదియిదౌనె?

సీ॥ సంస్కృతాంధ్రాంగ్ల భాషాపయోనిధి నగ
స్త్యమునీంద్రునట్లు నీ వావినావు
అమృతమ్మునిడిన గీతాచార్యుఁబోలె వ
క్తృత్వపాండితిఁ బంచి యిచ్చినావు
భక్తాంజనేయుని భంగి గాంధిమహాత్మ
కార్యమూని యశంబుఁ గాంచినావు
స్వేచ్ఛావరోధులనేని యజాత శ
త్రుస్ఫూర్తిఁ బ్రేమింపఁ దొడరినావు

గీ॥ విక్రమించి యాంధ్రశివాజి విభవమొప్ప
లీలఁ జీరాలపేరాల నేలినావు
నిఖిల జనరంజకుని నిన్ను నేఁడు విభవ
విగత భవుఁజేసెఁగా క్షయోద్వృత్తిఁ బూని
దుగ్గిరాలాన్వయాంభోధి తుహినకిరణ!
యాంధ్రరత్న గోపాలకృష్ణా! మహాత్మ !

సీ॥ అనివార్యముగ నెల్లరును భక్తిసేయఁగ
గట్టురామాలయ మక్కై
భారతీయులనెల్ల బ్రాహ్మణులజేయు
పరమాశయముఁ గొని
ప్రాణంబుగానిన్ను భావించి పూజించు
సహధర్మిణిని దుఃఖజా
చిన్నారిపొన్నారి చిఱుతపాపని వృద్ధిఁ
గనకుండఁ బేదఱికము

గీ॥ ముప్పదెన్మిది యేండ్లకే పురుషసింహ!
యరిగితివి దివి; కందైన నాత్మశాంతిఁ
గనుచు భారతీయోద్యమమున కఖండ
విజయమొన గూడునట్లు దీవింపుమయ
యార్య చిత్తరంజనయత్న! యాంధ్ర

క॥ గోపాలకృష్ణ నాశయ
దీపికఁ గైకొని దాస్యతిమిర మెడయ
బ్బాపరి పూర్ణత జననికి
నోపికతోఁ గూర్చుఁ డార్యసోదరులారా

ఉ॥ "పాలకులా నిరంకుశులు, వారల కెల్లెఱుం
శీలము; స్వేచ్ఛలేమినిఁ గృశించితి; మా
జాలఁగ నెంతు; రెట్టియగచాట్లను బొందిన
కాలమహత్త్వమే మొయిఁకఁగాఁగలకార్య

జాలినవారు వేల్పులని నమ్మితి; నయ్యయొ! మోసమయ్యె; వే
వేలకు మించిపోఁదగిన విల్వగలట్టి మదాంధ్రరత్నమీ
పేళమహేంద్ర జాలమున విస్మయమొప్పఁగమాయమాయె; నా
పాటికి కెంక దిక్కెడియొ ప్రాణము లెవ్విధి మేన నిల్చునో;

ప్రీలె మనంబు; మత్సుతులు వీరలు బాలురు; వీరు మద్వ్యథో
ద్వాలతనైన దుస్సహవిధంబు రవంత యెఱింగేని యా
భీల విపచ్చటల హృదయభిన్నత నొందెదరో" యటంచుఁ గ
న్నీరులు గ్రక్కికొంచెటులు నిల్చెనొ చూడరె భారతాంబికల౹

# "ఆంధ్రరత్నమా"

(కీ॥ శే॥ బులుసు రామజోగారావు)

పరమపదించితే? సుతునిబాసియు ముప్పదియెన్మి దేండ్లకే
నరపరనామధేయ! చిననాటిసఖుండ! యశోవిశాల! చీ
పురుపులనై మహాక్షయను పోరగలేకను నాలుగేండ్లు మీ
పురము చిరాలనే గడపిపోతివా? చూపకెమోముమాకికన్. ౧

చదువకనేర్చి వేదములసర్వము నీవుగ్రహించి యేరికిన్
చెదరవుడుగ్గిరాల పరవీరకుమార సెబాసుకాని, యా
ముదుసలి మృత్యుదేవతను మువ్వురుదేవు లదేలపంపిరో?
పదిలముగాత్వదీయ సుఖబంధము ద్రెంపగ పిన్ననాటనే! ౨

నీతగుమాధురీకథలు, నీపదగుంఫన, నీకవిత్వముల్,
నీదగు ధర్మశాస్త్రరుచి, నీబహుశ్లోకస్తుతు లు నీకేచెల్లరా!
లోతగు ధర్మశాస్త్రములలో పెనుగండరగండ! స్వర్గమున్
జూతమటంచు స్నేహితులజూడక యేగితివా, సహోదరా! ౩

చాలని రాజకీయముల జాలనిశాస్త్రపురాణ ఘోషలున్
జాలనిజ్యోతిషంబు మరిచాలని ఆంగ్ల "యికానమిక్సు" నే
డేలొకొ? వీడిస్వర్గమున కేగితిమిత్రమ! దుగ్గిరాల గో
పాల! వరాలమూట! జితపార్థ! త్రివిక్రమ! ఆంధ్రరత్నమా! ४

భావతరంగిణీ! ఘనశుభప్రదమూర్తి! దయాసముద్ర! మే
ధావి! యశశ్శరీర! కుధర్మకుఠార! కుశాగ్రబుద్ధి! నీ
చావిదికాదు- పండితులచావెసుమీ మనయాంధ్రమాతకున్
రావ! మరెన్నడేనియును రాజ్యములేలగ నాంధ్రరత్నమా! ౫

# ఆంధ్రరత్నస్మృతి

(జంపాల వెంకటనృసింహము)

స్వచ్ఛ సంకల్ప నిరతుఁడు స్వార్థరహితుఁ
డాత్మదేశసేవార్థమ్మె యంకితమ్ము
చేసిజీవిత, మతుల ప్రసిద్ధుఁడైన
"ఆంధ్రరత్న"ను స్మరియింపుఁ డన్నలార! ౧

భారత దేశీయ ప్రాక్తన తపముల
ఫలమన వెలసిన భవ్యమూర్తి
ఆత్మోన్నతిగయింప కాత్మదేశోన్నతి
కాత్మార్పణమొనర్చి నట్టిసుకృతి
బ్రాహ్మణమతయథార్థత్వమ్మొ నర్థించి
"గోష్ఠి" నేర్పఱచిన కోవిదుండు
సేవాపరామర్శ చెల్వొందఁగా "రామ
దండుఁ" గూర్చిన భక్తి తత్పరుండు
"ఆంధ్రరత్న" గోపాలకృష్ణాఖ్యకీర్తి
కాయుఁడు, తదాత్మకుశాంతి కలుగునట్లు
వాని సద్బోధ కార్యరూపానఁజూపి
అలరుఁడు కృతజ్ఞతాస్ఫూర్తి నాంధ్రులార॥ ౨

బాలురలోన బాలుఁడయి పండితమండలినెల్ల పండితుం
డై లలితార్థ వాగ్విభవుఁడై జనసేవయె జీవితమ్ముగాఁ
గాలమువుచ్చి సర్వజన గౌరవముంగని యౌవనస్థితిన్
దూలిన "యాంధ్రరత్న" కిల దోసిలియొగ్గని సంస్థలుండునే?

# గోపాలకృష్ణుని నిర్యాణము

( జోశ్యుల నారాయణమూర్తి )

సీ॥ శ్రీరామనామమన్ - క్షీరాంబునిధి మున్గి
తేలియాడుచునుండు - ధీరవరుడు
ప్రబలమై విలసిల్లు - రామదండును గూర్చి.
మాతృసేవను సల్పు - మహితగుణుడు
భరతఖండమునందు - ప్రఖ్యాతమగు కీర్తి
నాంధ్రమాతకు నిచ్చు - ననుగుబిడ్డ
చీరాల పేరాల - వీరసైన్యశ్రేణి
కధిపతియై యొప్పు - నలఘుకీర్తి

గీ॥ దుగ్గిరాలాన్వయాబ్ధిచం-ద్రుండు పూజ్యు
డవని గోపాలకృష్ణుండు - ఆంధ్రరత్న
మతుల మార్తాండతేజుండు - అస్తమింప
నింక చీకటిగాక వే-తేమి కలుగు ? ౧

గీ॥ ఆంధ్రమాతను ప్రబల దుః-ఖాబ్ధిముంచి
అమరపురమున కరిగితే - యాంధ్రరత్న !
అకట ! నినుబోలు దేశభ-క్తాగ్రగణ్యు
గాంచగల్గునె భారత-ఖండ మికను॥ ౨

గీ॥ అతుల విద్యయు పాండిత్య - మలరజేసి
వాయుసుతు తుల్యుగా రాము - భక్తుజేసి
అయయొ ! ముప్పది ఎన్మిదేం-డ్లాయు వాసగి
నట్టి నటువకు న్యాయమే - యిట్టు సేయ॥ 3

సీ॥ ఎవ్వనియాజ్ఞనే - యీశ్వరాజ్ఞ యటంచు
చీరాల పేరాల - వీరులనిరి
ఎవ్వని వాగ్ధాటి - కీ యాంగ్ల ప్రభువుల
గుండియల్ దడదడ - గొట్టుకొనెనొ
ఎవ్వని క్రోధరూ-క్షేక్షణ వహ్నికి
భీతిల్లి చెరలోన - బెట్టినారొ
ఎవ్వని మృదుభాష - లీ యాంధ్రభూమిని
కర్ణామృతములౌచు - ఘనతకెక్కె

గీ॥ దేశభక్తుండు దేశభ-క్తాగ్రగణ్యు
డమలచరితుండు దుగ్గిరా-లాన్వయుండు
దివిజ కవివరు గుండియల్ - దిగ్గురనగ
అరిగినాడయ్యయో యిప్పు - డమరపురికి॥ ౪

సీ॥ కోర్కె జనించెనే - గోక్లేను జూడగా
నమరలోకంబున - కరిగినావు
కాంక్షించితే బాల-గంగాధరుని జూడ
నమరలోకంబున - కరిగినావు

వాంఛించితే దేశ-బంధుః కౌగిలిజేర
నమర లోకంబున - కరిగినావు
రామాజ్ఞయైనదే - "రార కృష్ణా" యంచు
నమర లోకంబున - కరిగినావు

గీ॥ కాకయున్నదరిద్రాంధ - కారమగ్న
లయిన నీసతీసుతుల శో - కాబ్ధిముంచి
యింతలోననె పోవంగ - హేతువేమి
అఖిలగుణగణధన్య యో - యాంధ్రరత్న॥

సీ॥ పాశ్చాత్య ప్రభు పరి - పాలనా క్రమముల
ముల్లోకములజాట - బోయినావొ
భారతీయ స్వతంత్ర - పోరాట మటసల్ప
నీ సోదరులబాసి - యేగినావొ
ఆకొన్న యాంధ్రుల - కైశ్వర్యమునుగూర్ప
ధనదుని యాచింప - దరలినావొ
కలలోననైన నీ - కనులకు గాన్పించు
విష్ణు సన్నిధిజేర - వెడలినావొ

గీ॥ పృధివిలోన నొకించుక - విసుగుజెంది
కొంత విశ్రాంతిగైకొన - గోరినావొ
అటులగాకున్ననిన్ను న - సహాయశూరు
మృత్యుదేవతకైనను - మ్రింగవశమె॥

# గీతమాలిక

(అల్లమరాజు నారాయణరావు)

తారకల యందుఁగుముదబాంధవునిరీతి
నాగగణమున నైరావతంబు పగిది
లలితసుమతతియందు గులాబిమాడ్కి
లోహనికరంబునఁ మేల్మిరుక్మమట్లు
కలితభూషలఁ దల మానికంబుభాతి
వాజిచయమున నుచ్చైశ్శ్రవంబుపోల్కి
రాజసముదాయమున ధర్మరాజు సరణి
కవిబిడౌజులకొజ్జ వెంకన్నవరుస
జలధిఁబుట్టిన పీయూష చందమునను
స్వర్ణదీమేరు మందార సదృశముగను
పావనంబైన సద్యశోభరితమైన
సంతతాన్న ప్రదానవిస్తారమైన
దుగ్గిరాల మహావంశ దుగ్ధవార్ధి
నోషధీశుని కరణి నీవుద్భవించి
నిండుగా విద్యలన్నిటి నేర్చినావు
వివిధపరదేశ యాత్రఁగావించినావు
దొరల మరియాదలంబొంది మెఱసినావు
నీకు సరివారులేకుండ నెగడినావు

కష్టసుఖముల సారంబుఁ గాంచినావు
కలిమిలేములు దిరములు గావటంచు
బుద్బుదప్రాయములటంచుఁ బోల్చినావు
తనువు లస్థిరమంచును దలఁచినావు
కోపతాప గర్వంబులు కూడవనుచు
దురితములు జేసినఁ ముక్తి దొరకదనుచు
మోహమానస మొందుట ముప్పటంచు
సూర్యవంశ పారావార సోముఁడైన
విజయరాఘవ మోక్షద విపులమృదుల
చరణ శతపత్రయుగ్మ మశ్రాంతమెల్ల
భూత సంహతి కాధారభూతమనుచు
సకల సుగతులకుఁ నివసనమటంచు
నమ్మినాఁడవు భక్తి నీసొమ్ముకాదె
దేశభక్తి రక్తమ్ము నీ దేహమందు
నాళ నాళంబులందు విన్యాణముగను
పాఱఁగాలేదె? భూరి ప్రవాహములుగ
రత్నహారంబులౌ నీకు రామచంద్రు
తల్లిదండ్రులయెడ భక్తిఁ దనరినావు
గురువులందున సద్భక్తి నెఱపినావు
బంధు మిత్రులయెడఁ ప్రేమఁబరగినావు

పేద సాదలపైఁ గృపఁ జెల్గినావు
భక్తిరసపానమునఁ గాంతిఁ బ్రజ్వరిల్లి
నీకుఁ బగ వాఁడులేఁడన్న! నిజముగాను
రాజులందున రాజువై ప్రబలినావు
యోగులందున యోగివై యుంటి వీవు
పండితులయందు నుద్దండ పండితుఁడవు
తెల్లదొరలందు మెఱఁగినదిట్ట వీవు
జోగులందున జోగిగాఁ జొచ్చినావు
నీతివాక్యాలి జనులకు నేర్పినావు
టుంటితేనియ లొల్కుచు సొబగుమీఱు
పల్కులంజిల్కి యానంద పరచినావు
కపట చింతలు నీ యందుఁ గానరావు
పద్మనాభునికిఁ భయపడుదు వీవు
సద్గుణాకార! నరులకు జడియవీవు
శాంతమే భూషణము శక్తి సతమునీకు
చివరకుఁ బ్రాణములు దేశసేవ కొఱకు
ధారవోసిన మహనీయ! ధన్యచరిత!
అవని నావర్శకుండవై యలరినావు
మరువఁగాలేము నీ ముద్దుమాట లనఘ
కనక మనలేము నీ రూప కాంతులన్న!

ఆంధ్ర జననీ విలాపంబు నాపరావె?
మాయ నన్మొట్టరాకు నా మాలకాకి
యనెడు తెఱఁగున సురపురి కరిగితౌర
చాలు నీ లీలలెల్ల గోపాల లీల
లఖిల సుమనస మునినుత! యాంధ్రరత్న!
భాసురాత్మ వి స్తీర్ణ గోపాలకృష్ణ!

## "దా రి జూ పి తి వీ వు...."

(ప్ర. రంగాచార్యులు)

మ॥ "అవనింబుట్టువు గాంచినందుకు ఫలం - బంగ్లేయభాషంబతిం
పవి శేషంబుగవి త్తసంచయము గూ-ర్పంజాలుదుంగాదె" యం
చవినీతి జరియించునాకు భవదీ-యాహ్వానమే దారిజూ
పి విభాంతరశక్తు జేసెనిదినే-వేమాఱుజింతించితి॥ ౧

గీ॥ మధురభవదీయ వాగ్ఝరీ మహితభంగ
తతుల నఖిలాంధ్రలోకమ్ము దానమాడ
ముంచిన చరిత్రనామది ముంచకుండ
గడపలేదొక్క దినమైనగానినేను॥ ౨

పత్రికవిమర్శనమునకు బదులుచెప్ప
"బ్రతుకుదు నటంచు జెప్పగారాదు, బ్రతుక
గల్గుదునయేని విధియనుగ్రహముచేత
దల్లిపదముల నా జీవితమ్ము నర్ప

ఱమ్మొనర్చుటకంటె భాగమ్యగలదె?"
యన్న నీమాట నీమృతివిన్న నేడు
నామనఃకవాటము విదీర్ణమ్మొనర్చి
వైచుచున్నది సుమ్మ! గోపాలకృష్ణ॥

# మృతజీవి గోపాలకృష్ణమూర్తి

(భాగవతుల సుబ్బయ్యశాస్త్రి)

సీ॥ వందలు వేలకొలంది మానవులను
పరవశులం జేయు వాగ్విభూతి
చెట్లను శిలలను చిగురింప కరగింప
గాజాలు సరసంపు గానపటిమ
మహనీయ సంస్థల మార్గదర్శకుడై మ
హాఖ్యాతి గాంచిన యట్టి నేర్పు
సకలంబు వేదాంతసారంబు కరతలా
మలకంబుగా జూచు నలఘుశక్తి

తే॥ గీ॥ యఖిలమానవకోటి బ్రాహ్మణులజేయ
గా మదిని కోర్కెగల్గి యకాలమృతిని
జెంది లోకంబులో మృతజీవుడైన
కీర్తిశేషుడు గోపాల కృష్ణమూర్తి॥

(గోష్ఠి)

# గోపాలకృష్ణసమాఖ్యుఁడు

(కేసరి ఆదినారాయణశర్మ)

మ॥ అకటా! పాపపు దైవమివ్విధిని నన్యాయంబు గావించె నా
యకచూడామణి నాంధ్రరత్నమును సత్యాన్వేషణావ్యాహత
ప్రకటీభూత పవిత్రవర్తనుని దివ్యద్దేశభక్త్యున్నతున్
సకలాశాంతర విస్తృతామలయశున్ శంసద్గుణున్ కృష్ణునిన్ ॥౧

సీ॥ రామదండు నంచితముగఁ జీరాల
పేరాల నిల్పిన పెద్దయేడి?
పరదాస్యమునకన్న భైక్షుకవృత్తియ
మేలని చాటిన మేటి యేడి?
సంస్కృతాంగ్లేయాంధ్రసాహిత్యమున నస
మాన పాండితిగన్న మాన్యుడేడి?
రామనామ పదాబ్జరసముఁ దాఁ గ్రోలియు
భక్తాళికొసఁగిన భవ్యుఁడేడి?
తే॥ గీ॥ భరతజననీ చరణ బద్ధ పటుతరోరు
శృంఖలాబంధమోక్షణ చింత నెవఁడు
జీవితమ్మును బుచ్చి యశేషమిత్రి
లోకమును దుఃఖవారాశిలోన ముంచి
మిత్తివాతను బడినట్టి మిత్రుఁడేడి?

ఆంధ్రరత్నాహ్వయుం డేడి ? యనుచు లోక
మనవరతమును నిన్ జూడ నభిలషించి
వెదకుచున్నది, యివ్విధి వీడి మమ్ముఁ
గృష్ణుఁజేరితె ? గోపాల కృష్ణయార్య ! 3

మ॥ అసహాయోద్యమ కార్యసాధనమునం దశ్రాంతమేదీర్ఘ ద
ర్శిసముత్తుంగ ప్రయత్నముల్సలిపి నిర్ణీతాహ్వగాగ్రేసరో
ల్లసితామేయ పదౌచితి స్ఢనియ కాలాంతాహిదంష్ట్రాగ్రిశి జొ
చ్చి సమంతర్హితుడయ్యె, మిత్రగణముల్ చింతాబ్ధినిమ్మగ్న జే
సి, సుపర్వాలయవాసులైన తిలకున్ శ్రీమంతు దాసున్ స్వకా
ర్యసమాప్రాప్తిఫలమ్ముఁ గోరఁగను జేరంబోయె గోపాలకృ
ష్ణసమాఖ్యుండిఁక నాంధ్రలోకగతిఁ గానన్వచ్చువారెవ్వరో? ౪

# పంచరత్నములు

(జి. గోకర్ణము)

సీ॥ పరమపావనమైన భారత జనయిత్రి
గాంచిన సుతులలో ఘనుఁడెవండు
సకల విద్యాప్రౌఢి సత్సభాంతరముల
బుధుల మెప్పించు విబుధుఁడెవండు
పాలనా దుష్కరపద్ధతుల్ నిరసించు
గురుతరోపన్యాసకుం డెవండు

స్వాతంత్ర్యమును గోరి స్వార్థంబు విడనాడు
సత్యదయాశీల స్వాంతుఁడెవడు

గీ॥ దైవభక్తిని వదలని ధన్యుఁడెవ్వఁ
డట్టి శ్రీ దుగ్గిరాల కులాబ్ధిచంద్రుఁ
డైన గోపాలకృష్ణయ్య యాంధ్రరత్న
మమరపురికేగెఁ బ్రజల దుఃఖాబ్ధిముంచి॥

సీ॥ అదిగో స్వరాజ్యంబు హైందవజాతికి
ఖద్దరు ధరియింపఁ గల్గుననును
ఐకమత్యము లేక హైందవజాతికి
గల్గదు స్వాతంత్ర్యగరిమ మనును
దేశీయ వస్తువుల్ దేశీయవిద్యలు
గౌరవింపక మేలు గలుగదనును
మద్యపానార్జన మన వారికిని తగ
దిట్టి విపర్యాసమేల యనును

గీ॥ నిమ్నజాతులపై బ్రేమ నెనరుగల్గి
దాస్యము గోరకుండుట ధర్మమనును
దుగ్గిరాల కులాంభోధి తుహినకరుడు
కీర్తిశేషుడు గోపాలకృష్ణయాఖ్యుఁ
డమరపురికేగెఁ బ్రజల దుఃఖాబ్ధి ముంచి॥

సీ॥ హిందూ ముసల్మాను లేకమై యుండిన
రాజ్యస్వతంత్రత రమణవచ్చు
నాదిమాంధ్రుల గూడి యమల విద్యల నేర్చి
మెలగుఁడు నిశ్చింత మేలుగల్గు
కాంగ్రెసు బోధించు క్రమపద్ధతుల నమ్మి
సత్యవ్రతంబును సలుపవలయు
కుటిలంపు పదవులకును బోయి భారత
జాతి గౌరవమిల జదునుసేయ
గీ॥ వలదు వలదంచుఁ జెప్పు వాగ్వైభవుండు
శాంత గుణరాశి తత్త్వ విజ్ఞానవేది
దుగ్గిరాల కులాంబోధి తుహినకరుఁడు
కీర్తిశేషుండు గోపాలకృష్ణయాఖ్యుఁ
డాంధ్రరత్నంబు దివికేగె నక్కటకట! 3
సీ॥ భావము స్వరాజ్యవాంఛచే బ్రబలుచుండ
నదియు రా దిప్పుడిటనుంట యర్థ్మఘగునే
రమ్మ స్వారాజ్యసుఖము చూరయును గొనుము
వసుధ శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణ
లెమ్మనుచు నిన్నుఁ దోడ్కొని లీలనేగె
నౌర! కాలంబుగాకున్న నదనె! యిపుడు
దేహయాత్రను చాలింప ధీరవర్య!
రామనగర విద్యాగోష్ఠి రామచంద్రు

గీ॥ నాలయ ప్రతిష్ఠలను వీడి యరుగ నీకు
కీర్తిశేషుడవై ప్రజ కార్తిఁగూర్చి
నీదు విజ్ఞాన సంపద నిపుణవాక్య
సంపదల నెప్పటికి మర్వజాల మనఘ॥ ౮

గీ॥ అంటరానను జాడ్యమీ యాంధ్రదేశ
మెల్లెడల వ్యాప్తమై యుండి యింపు బెంప
దానికి చికిత్సకుండవై తఱిమినావు
వాగమృత వీచికలనంపి వ్యాధినెల్ల
కీర్తివైభవ గోపాలకృష్ణయార్య
నిన్ను మరవంగజాలము నెమ్మనముల॥ ౯

## "గోపాలకృష్ణుండు కొంటె కొండాయ"

(నూరి పెద్ది కృష్ణమూర్తి)

గాంధీమహాత్ముండు - కరుణతో దీక్షతో
హరిజనుల గావంగ - కదివరదు గొలవంగ
పరులనక హరిజనుల - పరమాప్తులని నెంచి
సరివారివలె వారి - మరియాదతో జీరి
దరిజేర్చి హరిభజన - దళమందులో జేరి
గళమందు ఈశ్వరుడు - గరళంబు ధరియించె
పరులనక నిరతంబు - హరిజనుల స్నేహంబు
ధర నంటురోగంబు - తరలింప లేలెమ్మ
జాతి ఖ్యాతి సుఖంబు - జాగేల చేకూర్పు

జాత్యహంకారంబు - అధికార గర్వంబు
అత్యంధకారంబు - ఆంధ్ర ! యావేశంబు
దెంద మానందంబు - జెంద నీ హృదయంబు
ముందుగ సహసంబు - బందుగుల వ్యసనంబు
వేదముల రోదనంబు - పేదల నినాదంబు
బ్రాహ్మణుల పదిలంబు - భక్తులకు ప్రాణంబు
నిర్ధనుని మోహంబు - సుస్థిరుల దేహంబు
నాస్తికుల సోహంబు - ఆస్తికుల స్నేహంబు
సుస్తిగల కాయంబు - పిసిగొట్టు దానంబు
కసికందు క్రోధంబు - రసహీను స్నేహంబు
వ్యసనంబు నియమంబు - ముసలిపై నిరసంబు
దేశభక్తుల డాబు - దేశద్రోహకరంబు
నిజభక్తి సదనంబు - నిర్జనుల దేశంబు
భజన వారి కులంబు - భక్తాళి స్తవనంబు
వ్యక్తిలో దూష్యంబు - పంక్తిలో లోపంబు
భుక్తిలో పూజ్యంబు - శక్తిలో త్యాజ్యంబు
ముక్తికై రాగంబు - సూక్తికై శోకంబు
రక్తికై త్యాగంబు - రీతికై బేరంబు
నీతికై సుగుణంబు - ఖ్యాతికై కలహంబు
రాతికై వ్యసనంబు - రామభక్తు మనంబు
ఆంధ్రరత్నము "యుబ్బు" - హరిజనులకే సబ్బు

ఆలకించియు దుబ్బు - అంటురోగము ద్రొబ్బు
"రామదండు"నయబ్బు - రామనామ ఫలంబు
కామితార్థములబ్బు - కలతలను విడనబ్బు
సమితి సభ్యులకబ్బు - సద్బ్రాహ్మణులకబ్బు
డబ్బున్న (శక్తున్న) నీ కబ్బు - సద్బ్రాహ్మణుడవౌదు
గోపాలకృష్ణుండు - కొంటె కొండాయ!

# గోపాలకృష్ణుని నిర్యాణము

(అప్పల వీరవేంకట జోగయ్యశాస్త్రి)

గీ॥ దేశనాయకులెల్లరుఁ దెగియె మాదు
కుడిభుజం బంచు క్రిందికి గ్రుంగ భరత
మాత శోకాబ్ధి మున్గగ మమ్ము విడిచి
పయనమైతివె దివికి గోపాలకృష్ణ॥ ౧

ఉ॥ ఆరయ భారతాంబ పలు కగ్గలికన్ శిరసావహించిన
ట్లోర శిరంబునందున నోహో యన ఖద్దరుదాల్చి వచ్చి యూ
రూర ప్రచారమున్ సలిపి యోర్పున మాతృఋణంబు దీర్పగా
కూరిచి తెల్లవారల నకుంఠిత లీలల నాంధ్రరత్నమా॥ ౨

ఉ॥ నీ దగు దేశభక్తియును నీదు వివేకము త్యాగశీలమున్
గాదె శిలాక్షరంబులుగ గ్రక్కున చిత్తములందు వ్రాసి యి
మ్మేదిని శాంతి యుద్ధమున మేను ద్యజించితి వీవు కృష్ణ మే
మే దురదృష్టవంతులము యిమ్మెయి స్వర్గము నీకెకల్గెడిన్॥ ౩

# నిర్వాణ శాంతినొందె

(శాస్త్రపాటి తిరుమలరాయుడు)

శ్లో॥ శ్రీదుగ్గిరాల గోపాలకృష్ణయాఖ్యో మహీసురః ।
అప్తాన్ బంధూన్ పరిత్యక్త్వా స్వర్గం ప్రాపమహామతిః॥ ౧

కం॥ శ్రీ మహిశేశ్వరు దయచే
భూమిని సత్కీర్తి నిలిపి పుణ్యస్థితిచే
దా మృతజీవుండై స్వ
ర్ధామత గోపాలకృష్ణ ధన్యుడు వెలయున్. ౨

మ॥ విపుల న్యాయపథానువర్తనమున న్విద్యాస్ఫురచ్ఛక్తిచేఁ
గపటం బించుకలేని బుద్ధిగరిమస్ధారుణ్యసంధానతన్
అపరగ్రాంధియనంగ నొప్పితివి యార్యానేకకార్యప్రియా !
కుపితప్రాభవమంత్రభంగకరణా! గోపాలకృష్ణాహ్వయా! ౩

సీ. ఎవ్వాడు మొదట దానెల్లప్రజకు గాంధి
మతబోధజేసి సమ్మతినిగొల్పె
నెవ్వాడు చీరాల, యిండ్లపన్నులకయి
విజనస్థలినిజేసె విడువకపుడు
ఎవ్వాడాజనమునకెల్ల నూత్నగృహాళి
గ్రాంధి జటు స్తంభ రక్తిగట్టె
ఎవ్వడు లోకోపకృతికయి పనిబూని
కారాగృహముజేరె ధీరుడగుచు

తే॥ గీ॥ నట్టి శ్రీదుగ్గిరాల మహాన్వయుండు
సరస గోపాలకృష్ణయ్య జనులనెల్ల
తీఱని విచారవార్ధిని దించిమించు
స్వర్గమునకేగి నిర్వాణ శాంతినొందె. ४

కం॥ అమృతజీవన కచ్చట
క్షేమము, శాంతియు, నుదార సిద్ధియు మోక్షం.
బా మాధవుఁడీవుత, సుర
ధామమునన్ స్థిరనివాస, ధర్మము గలుగన్. ౫

# హా! విధీ!

(మల్లపాల సుందరరాజు)

కం. శ్రీపావన చారిత్రుడు
జాపలి శుభనేత్రు సర్వశాస్త్రార్థ సుసాం
గోపాంగుడు ఆంధ్రరత్న
గోపాలుడు వాసినాడె గుణగణఖని హా! ౧

కం. ఏపాపపుణ్య మెఱుగడు
పో; పావను మకుటిలేమి భూపాలుని మా
గోపాలుని గుణరత్నము
నీపొట్టును బెట్టుకొంటె నిర్దయత విధీ! ౨

చం. పరమపదించె హాస్యలస పాలిటి కల్పక విద్రుమంబు, సు
స్థిరత యశోవిశాలుని వి - శేష విశాలగుణాలవాలునిన్
భరత సుపుత్రరత్నమును భవ్యపవిత్ర చరిత్రమూర్తినిన్
గరుణ యొకింతలేక కలకాలము నాంధ్రుల దుఃఖపుచ్చి హా!
హరిహరి! నీదుపొట్టనకటా! దిగ్రమింగితె దుష్టకాలమా! ౩

ఆ. వె. మా యాంధ్రిరత్నము - మా రామదాసుని
హాస్యరస ప్రిపుల్ల - భాసమాన
మోము, మేరుధీరు - పొట్టనిడుకొంటివా
భూరిగుణుని విధీ ! బుద్ధిలేక. ౪

ఉ. బోరన యాంధ్రదేశపుం - ముఖ్యులు దిగ్భ్రమజెంది కుండనా
మారసమానుఁడీ విభవ వత్సర జ్యేష్ఠపు కృష్ణ సప్తమీ
యీ రవివాసరంబునను - కృష్ణుఁడు చేరెను మోక్షస్వర్గమున్
ద్వారకనున్న కృష్ణుఁ-డవతార సమాప్తమునొందు కై వడిన్ ౫

# గోపాలకృష్ణ నిర్యాణము

(జగర్లపూడి వెంకటేశ్వర్లు)

సీ॥ గీతార్థ బోధనా ఖ్యాతాధునిక కృష్ణు
బాలగంగాధరు గోలుపోయి
రాజితహిత చిత్తరంజక సద్గుణ
శీలుదాసుని మట్టిపాలు నేసి

అభినవ గోపనావ్యాజ కృపాళు గో
పాల కృష్ణుని నేడు నేలగలిపి
తదితర దేశసోదర ముఖ్యకార్య ధూ
ర్వహుల నెందరనో స్వర్గమున కనిపి

గీ॥ చక్కనగు పండులూడగ కుక్కమూతి
పిందెలనుబట్టి వ్రేలాడు విధముజరిగె
నెట్లు జీవించెదో తల్లి ఇంకమీద
పరమకరుణా రసోపేత! భరతమాత ౧

సీ॥ పరుసకులొంగి తందరపాటునను గ్రుంగి
వినతగాంచిన మంచి బిడ్డడనగ
సిలుగుల బ్రతుక రోసిన సతిదేవికి
పాలిటికెన్నిదో చూలియనగ
సవతి బిడ్డనికి విసంబగునటు దోప
నదితి గన్నట్టి శ్రియః పతియన
నిల్లాలువో కృశియించి మించిన శంత
నునికగు ముద్దుల తనయుడనగ

గీ॥ భారతీయుల పాలికల్పక మొకండు
దనరజనియించె ననుచు సంతసముజెందు
ప్రజలగర్భంబు నందొక వ్రణముజేసి
చరగినాడవె దయమాలి ఆంధ్రరత్న! ౨

సీ॥ ఒరుని సంపదజూచి యోర్వలేమిని దుఃఖ
మందు వారెందరో యవని నుండ
తనకున్న దానినెంతయు వృద్ధియొనరింప
బలుపాట్లు పడియెడి వారలుండ
విద్దెలేకున్న తీవినిజూపి వీథుల
పచరింపు చుండెడి వారలుండ
ఒకని హింసించి తారున్నత పదవులఁ
బడయంగ నెంచెడి వారలుండ

గీ॥ నోర్పుగలిగియు తృప్తుడై యున్నతమగు
విద్యనలరారి పరహింస వెఱచు ధర్మ
నియతుజూచిన గండ్లు మండినవె నీకు
మిత్తివా! యెంతపనిజేసి మించినావె? ౩

సీ॥ జవసత్వముల దేశసంఘసేవకు ధార
వోసిన తిలకు దా పుడమి విడచె
పిననాటనుండి యుగ్గున దేశసేవనే
త్రాగిన గోక్లే వదాన్యుడరిగె
కలధనమెల్ల లెక్కను పెట్టకయ తన
పట్టునిల్పిన దాసు పయనమాయె
అరుదార దేశసోదరుల నున్నతికి దే
నెంచిన నౌరోజి యెపుడొ చనియె

గీ॥ నేడు మన ఆంధ్రిరత్నంబు నియతిదొలగి
నట్టి మనలను దిగనాడి యరిగెదివికి
ఆంధ్రిసోదరులార మీ కన్నివిధుల
చెడుగు నేకూరుదినములు చేరువయ్యె.

సీ॥ వినుకొలందిని మించువేడ్కగగ్లెడి మీయు
పన్యాసమెట వినంబడునొ యింక
నవనవోన్మేష దసూనామృతోపమ సువా
ద్మాధుర్యమెట వినంబడునొ యింక
అతిభీరులకు రోమహర్షంబు జనియించు
భాషలెచ్చట వినంబడునొ యింక
అహితులకేని నత్యాసక్తి గలిగించు
పలుకులెచ్చట వినంబడునొ యింక

గీ॥ అనుచు నార్తినిగుందు మాయాత్మలెల్ల
సంతసింపగ దేవతాసార్వభౌమ
మూర్తిగైకొని స్వీయప్రభుత్వసరణి
కేడుగడగమ్మ గోపాలకృష్ణమూర్తి॥

# రత్నాంజలి

(అబ్బరాజు వేంకట రంగారావు)

ఆంధ్రతేజము దిశలెల్ల నాక్రిమింప
క్షీరపురిచెంత సైకత శ్రీలలోన

రామనగరంబు గట్టిన రాజెవండు?
అతడె మా "ఆంధ్రరత్న"మై యలరువాడు. ౧

వేలసంఖ్యల జనసభావేదికలను
మేఘ గంభీర నిస్వనమేళనమున
మధుర వాగ్ఝరిజిమ్మిన మహితుడెవడు? అతడె॥ ౨

తెలుగువారలు తప్పులు దిద్దికొనగ
తెలుగునాడున విజ్ఞాన దీప్తివెలుగ
కూర్మి "కొరడా"ను బూనిన గురుడెవండు? అతడ॥ ౩

కఠినశిలలను గరగించు గానరసము
మించి మగవారి వలపించు మేనికాంతి
నాటికృష్ణుని మఱపించు మేటివాడు అతడె॥ ౪

రామదాసను విఖ్యాతనాముడగుచు
రామదండును స్థాపించి రాణమీఱె
"రామరాజ్యము" కోరిన రాచబంటు అతడె॥ ౫

రోమరోమాన నుప్పొంగు రోషశక్తి
దేహమంతట పారాడు దేశభక్తి
దివ్యగుణముల జెన్నారు ధీరమూర్తి అతడె॥ ౬

రాచవారల తలదన్ను రాచఠీవి
పేదసాదల నలరించు ప్రేమజీవి
హాస్యములపుట్ట అన్నివిధాలచిట్ట అతడ॥ ౭

దివ్యరత్నాలుగను పుణ్యదీవియందు
ఆంధ్రమాతకు బుట్టిన అనుగుబిడ్డ
కటకటా! నేడు లేడు మా కనులయెదుట! అతడె॥ రా

స్మృతుల నూతనమార్గాన సృష్టిజేయ
దేశవాసుల నుత్తమ ద్విజులజేయ
నుత్తమోత్తమ సంకల్పయోధుడెవడు? అతడె॥ రా

పంజాబు కాననప్రాంతాలు శోధింప
"పాంచాల కేసరిఁ" గాంచగలమె?
సంయుక్త రాష్ట్రాన సారాంబునిధులలో
"మోతిలాలు"ని జూచి మురియగలమె?
ఆంధ్రదేశములోన నలరారునిధులలో
"ఆంధ్రరత్నము" జాడ లరయగలమె?
ఉచ్ఛలపాలైన "యువక సింగాలను"
సాంద్రాటవుల జూడ సాధ్యపడునె?

క్షీరపురి ప్రాంతవాలుకా క్షేత్రములను
వెదకెదేలనో ఆంధ్రుడా! వెఱ్ఱివగుచు
లేదు మన "రత్న మచ్చట లేదు లేదు!
యువక హృదయాంతరాళాల యుండుగాని. ౧౦

# గోపాలకృష్ణ స్మృతి

(పెండెం వేంకట రాములు)

మ॥ విజయానంద సుధా రసాత్మక మహా వీరాంధ్రరత్నంబవై
ఘనమౌ దండము కోరమీసమును పాగాయుఁ హాయల్ మీరగా
ననయంబుఁ రుధిరాభవస్త్రముల సత్యాశక్తిమైదాల్చి గై
కొనవే సర్వజనాళి వందనములన్ గోపాలకృష్ణాహ్వయా॥ ౧

సీ॥ రాజితంబగు దుగ్గిరాల వంశమున రా
కేందుండవై జనియించినావు
ఆంగ్లదేశంబున కరిగి యచ్చట సర్వ
పండిత సంస్తుతుల్ వడసినావు
రామనగరమును రామదండును గూడ
నంచితభక్తి నిర్మించినావు
స్వాతంత్ర్య సామ్రాజ్య సమరంబునం గార్య
దర్శి పదంబుచే దనరినావు
తే॥ గీ॥ జగతి వాణియె యీరీతి జననమందె
ననగ నమృతధారా ప్రవాహము బోలు
వాక్కతుల దేశమంతట బరపినావు
భంజితాఖిల తృష్ణ గోపాలకృష్ణ॥ ౨

తే॥ గీ॥ క్షీరపురమిది మిక్కిలి చిన్నదయ్యు
భారతావనియందెల్ల బేరుగాంచి
వరలుట భవన్నివాసంబువలన గాదె
రమ్యతర సద్గుణావాస రామదాస॥ ౩

తే॥ గీ॥ విజయవాడ పురమున జూపించినట్టి
రమ్యతరమైన నీ యొక్క రామదండు
పాలకులనెల్ల గడ గడ వడకజేసె
భవ్యమతి ! దుగ్గిరాల గోపాలకృష్ణ॥ ౪

తే॥ గీ॥ దేశసేవా వ్రతమున కీర్తిని వహించి
సకల జనులును నిన్ను సంస్తవమొనర్ప
శీఘ్రముగ స్వర్గపురమున జేరినావు
పరమగుణ యాంధ్రరత్న ! గోపాలకృష్ణ॥ ౫

## "ఆంధ్ర పుత్రుని మరచినా రాంధ్రు లకట!"

(వావిలాల వేంకటసుబ్బయ్యశాస్త్రి)

చెప్పఁజాల నెందుంటివో చిన్న నాన్న
నీవు దేహమెప్పుడు వీడినావొ, నాటి
నుండి స్వార్థపరుడుగాక, అందలేక
పాటుఁబడుచుండెఁ బట్టాభి ఫలితమంతె॥ ౧

అష్టకష్టాలనుభవించి ఆరితేరి
నాడు, దేశసేవందు కాపాడగలడు
తల్లనంచు, మురియుచుంటి, తనయ! ఎందుఁ
బోతివని ఆంధ్రమాత వాపోవుచుండె॥ ౨

ఆంధ్రరాష్ట్రింబుఁ బ్రత్యేకమందఁగోరి
తమ్ములల్లాడుటే కాని తగిన నాయ
కాగ్రణులె లేరు ధనము కాసఁ జెంది
సభల గొంతెత్తి మాట్లాడి చనెడివారె॥ ౩

ఆంధ్రగోపాలు డరిగినాడంచు తోడి
వార లేడ్వఁగల్గిరి కాని, వరుసగాను
మట్టితోనైన నీరూపు మలచి నిలువ
బెట్టలేక యేమేమొ చెప్పెదరు! భళిర! ౪

ఉచితరీతిగ భృత్యుండు నూడిగంబుఁ
జేసినన్నాళ్లుఁ బ్రేమించి చేయకున్న
వాని మరచెడి యజమాని పగిది, నిన్నె
ఆంధ్రపుత్ర! మరచినారు, ఆంధ్రు లకట! ౫

# పుష్పాంజలి

(చుండి లక్ష్మీనారాయణరావు)

సీ॥ ఏ మహాత్మ జననమెత్తినదాది వి
శాలాంధ్రకోటులు సంతసిల్లె

ఏ దివ్యమూ_ర్తి తదేకదీక్షను తెల్గు
తోటను దిద్దగా బాటుపడియె
ఏ దివ్యవాణిశు దెచ్చట కేగినా
దిగ్విజయముతోడ తిరిగివచ్చె
ఏ మహా ధీశాలి సమరసింహ్వానివోలె
నాంధ్రరాష్ట్ర పునాది నట్టివైచె
గీ॥ ఘన యుగంధరు చాణుక్య గట్టి తిమ్మ
రుసుల బుద్ధిపటిమతోడ రుక్మిణీ వి
భుమధురంపు పేరఁ బరగి రామభక్త
మేటియై రామదండును చాటి భోగి,
త్యాగి, రాజయోగి యనగ తరలినట్టి
ఆంధ్రరత్న! మంజలిడెద నందుకొనుము॥ ౧

# మన ఆంధ్ర రత్నము

(డాక్టర్ శి. కె. ఎస్. ప్రసాద్)

అన్యదుర్లభ మహోపన్యాస విన్యాస
గంగా ప్రవాహ వాగమృతమయుఁడు
వాకు బాకున వైరివర్గము నొగి ద్రుంచి
తూటాడు పోటరి మాటకారి!
సంస్కృతాంధ్రాంగ్ల భాషా పాండితీ సమా
సమార్జిత కవితా సరస్వతి ప్రియుండు

సత్యాగ్రహానేక సమర రంగములందు
పేరు పొందిన మహా వీరమూర్తి

రామదండు మహాత్మని రాక నెనరు
పెంచి పూదండగా సమర్పించి యాంధ్ర
విజయ శంఖము పూరించు విజయు డాత
డాంధ్రరత్న మహానేత! అమరనేత!॥ ౧

బూటకపు రాజకియపు
నాటక మినాటి దుర్దిన క్రీడ నిరా
ఘాటముగ సాగునే? యీ
నాటన్; అటువంటి ఆంధ్రనాయకుడున్నన్॥ ౨

పదవికై కొట్లాడు భాయీలకా నేత
పేరెత్తుచే పెద్ద పిడుగుపాటు
పర్మిట్లకై ఎగబ్రాకు దళారుల
కానేత పలుకొక యంకుశంబు
ప్రజల ప్రాణాలతో పాచికలాడెడి
వారి పాలిట మృత్యువదన మతడు
గ్రూపులై తెగి యింటిగుట్టు బజారున
బెట్టువారికి చెంపపెట్టతండు

కీర్తిశేషుడు గోపాలకృష్ణయాఖ్యు
డాంధ్రరత్న ప్రభుత్వము నడలగొట్టి
వేపి చీరాల పేరాల లేపి లిప్త
స్వీయశక్తిని జాటు విజేత యతడు॥ 3

'నా' ననునది దేశంబె
గాదా యని లేని ముదముగని త్యాగులలో
నావర్యపురుషు డితడీ
మేదిని విడ "బుద్ధి గడ్డి మేసెన్ మనకున్" ॥ 4

ఆంధ్రరత్న సుపుత్రు గన్నట్టి కతన
ఆంధ్రమాతృకరత్న గర్భాఖ్యయైన
ఆంధ్రతేజము దిగ్దిగంతముల ప్రాకి
చలనమాడిన జాతి మేల్కొలుపు గాత॥ 5

# ధీనిధీ! గోపాలకృష్ణా!

(పంగనామముల రామచంద్రరావు)

ఆంగ్ల భారత ప్రభుత్వా న్యాయమార్గముల్
తెలచి చూపించిన దాదాభాయి
దేశీయ నిద్రా విధేయతామూఢత
దగిలి యార్చిన మెహతా మనస్వి
జన్మ స్వతంత్రతా స్వత్వనిశ్చయ దృఢ
లతిక పాదిడిన తిలకు మనీషి

అరిలోకమునకు సింహస్వప్నమై యున్న
రాజ్యాంగనుధి చిత్తరంజనుండు
కౄరపురుషుని కోపాగ్ని గ్రాఁగినారు
అకట! ఆంధ్రుని తలవ్రాఁత! అతని కుటిల
పాపదృష్టులు నీ మీద బడఁగ నేఁడు
పఱచినాఁడవె దివికి గోపాలకృష్ణ! ౧

నీ మిటారపుమాట నెఱజాణతనమును
నట్టువకత్తెకు బుట్టినిల్లు
నీ భక్తి పరిపూర్ణ నిర్మల సంగీత
పరిమళవాయువుల్ దిరుగుచోటు
నీ బాల్య కౌమార నిర్గతాంగ పటుత్వ
కారణం బిడిన భూసారపరిధి
నీకు ధైర్యపరాక్రమాకర్షణ చరిత్ర
పీయూషమిచ్చిన వీరమాత

నీ మనసు వేండియాటల నిరుకుపట్టు
వృద్ధి హర్మ్యాగ్రమెక్కించి పిడినతావు
అట్టి నీకైన గుంటూరు పట్టణమున
బ్రాణములఁ బాసినావు గోపాలకృష్ణ! ౨

శ్రీమంతంబగు నీ ముఖాంబుజదరస్మేరంపు లేపూఁతలున్
నీ ముద్దుం దెలినీటు చూపుల సమున్నిద్ర ప్రసారంబులున్
నీ ముక్తా సమదంతపంక్తికళుకుల్ నీ సుందరోష్ఠద్యుతుల్
నీ మచ్చుం బలితంపు మైసిరులు మంటింజేరెనే! ధీనిధీ! ౩

# ఆవేదన

(కంచిభొట్ల శివరామయ్య)

శా॥ కాషాయాంబరధారి భారతసతీ గారాబుపుత్రుండు వి
ద్వేషాహాయభుజంగ గారుడము దేదీప్యప్రతాపుండు; స
ద్భాషాభూషితు డార్యసమ్మతుడు లోభాక్రాంత దుర్మానసా
వేషాదూషితు గోపకృష్ణునకు గావింతుం నమస్కారముల్॥ ౧

ఉ॥ చక్కని రాజబాట సరసంబిహాముమున్స్వరము న్గనంగ చే
చిక్కగ రామదండనగజేసి తరించెను రామదాసు పెం
పెక్కిన యాంధ్రసద్యశము పిక్కటిలం దిశలందు నందులో
కెక్కిన జాలు నాంధ్రజన కీరితి మిక్కిలి వన్నెకెక్కదే॥ ౨

ఉ॥ బాపుజి నాయకత్వమున బాపురె బార్డొలి రూపుమాసె నీ
ప్రాపున నుజ్వలంబగుచు ప్రాకె దిగంతములందు పౌరులన్
ఊపిరి యుండగా నగరమున్నది లేనిది లెక్కసేయకే
కాపురముండజేసితివిగా యిసుకం పరితోషచిత్తతం॥ ౩

ఛ॥ ధనముగలాడు త్యాగియయి దారసిలంవలె దాని కార్యమై
పని నెరవేర్ప నీవలెను ప్రాజ్ఞుడుగావలె రెండు పద్ధతుల్
కనుగొన సున్న యాంధ్రజన కల్మికిం యన్యుల యాటపాటలే
మనమున కింపు నింపునను మాటలు నీకును నేడు క్రొత్తలే॥ ౪

# "ఆంధ్రరత్న" గోపాలకృష్ణయ్య

## షష్ఠిపూర్త్యుత్సవమునకు

కానుకల నర్పించిన

## దాతల పట్టిక

| | | |
|---|---|---|
| 1 | శ్రీ "ఆంధ్రరత్న" గోపాలకృష్ణయ్య శిలావిగ్రహ ప్రతిష్ఠాపన సంఘము - విజయవాడ | 50 0 0 |
| 2 | మ, రా, శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు<br>200 చాటువు పుస్తకాలు F. V. రు 37 8 0<br>రొఖ్ఖం 0 0 3 | 37 8 3 |
| 3 | శ్రీమతి పి. రాజేశ్వరీదేవిగారు | 25 0 0 |
| 4 | మ. రా. శ్రీ కాట్రగడ్డ మాధవరావుగారు | 20 0 0 |
| 5 | ,, ఆర్. వి. యస్. యన్. ప్రసాద్ బహద్దర్; ప్రసాద్ బ్రదర్సు | 15 0 0 |
| 6 | ,, అద్దంకి శ్రీరామమూర్తిగారు | 10 0 0 |
| 7 | ,, జైహింద్ సిల్కు & క్లాత్ ఎంపోరియంవారు | 6 0 0 |
| 8 | ,, జీబు వెంకయ్యనాయుడుగారు | 5 0 0 |
| 9 | ,, మజ్జి సీతారామయ్య పాత్రుడుగారు | 5 0 0 |
| | | 173 8 3 |

| | | |
|---|---|---|
| | త్రాటోవరు | 173 8 3 |
| 10 | జనాబ్ షుకూర్ అబ్దుల్లా సేట్‌గారు | 5 0 0 |
| 11 | మ. రా. శ్రీ సుంకర నాగభూషణం చౌదరిగారు | 5 0 0 |
| 12 | ,, నందిపాటి వెంకట నరసింహ్వారావుగారు | 5 0 0 |
| 13 | ,, డాక్టర్ టి. వి. యస్. చలపతిరావుగారు | 5 0 0 |
| 14 | ,, ముదిలి వేంకటేశ్వరరావుగారు | 5 0 0 |
| 15 | ,, మాజేటి రామమోహనరావుగారు | 5 0 0 |
| 16 | ,, బచ్చు కోటయ్య సన్సు. వేంకటేశ్వర్లుగారు | 5 0 0 |
| 17 | ,, సింగరాజు కృష్ణమోహనరావుగారు | 5 0 0 |
| 18 | ,, తాడికొండ కామేశ్వరరావుగారు | 5 0 0 |
| 19 | ,, ముద్దా నారాయణశర్మగారు | 5 0 0 |
| 20 | ,, దోనేపూడి సుబ్రహ్మణ్యం చౌదరిగారి జ్ఞాపకార్థం కుమార్డు రామసుబ్బయ్యగారు | 5 0 0 |
| 21 | ,, కొండేటి రత్తయ్యగారు | 5 0 0 |
| 22 | ,, జి. పైడన్నపాత్రుడుగారు | 5 0 0 |
| 23 | ,, డాక్టర్ పి. వి. ఆచార్యగారు | 5 0 0 |
| 24 | ,, తోపల్లి కుటుంబశాస్త్రిగారు | 5 0 0 |
| 25 | ,, న్యూఇండియా హోటల్‌వారు గాంధీనగరం | 5 0 0 |
| 26 | ,, రాంపిళ్ళ (పైదు)అప్పలస్వామిపాత్రుడుగారు | 5 0 0 |
| | | 258 8 3 |

| | | |
|---|---|---|
| | బ్రాటోవరు | 258 8 3 |
| 27 | మ. రా. శ్రీ యెర్నేని లక్ష్మీనారాయణచౌదరిగారు | 5 0 0 |
| 28 | ,, శొంఠి వెంకటరత్నంగారు | 5 0 0 |
| 29 | ,, దుగ్గిరాల శ్రీరామమూర్తిగారు | 5 0 0 |
| 30 | ,, ప్రభల వెంకటరామయ్యగారు | 5 0 0 |
| 31 | ,, వి. వి. సుబ్బారాయుడుగారు. | 5 0 0 |
| 32 | ,, చాడ శోభనాచలపతిరావు జమిందారు | 5 0 0 |
| 33 | ,, డాక్టర్ డి. గోవిందరాజులునాయుడుగారు | 5 0 0 |
| 34 | ,, మరుపిళ్ళ చిట్టిపాత్రుడుగారు | 5 0 0 |
| 35 | జనాబ్ అబ్దుల్ రహిమాన్ సాహెబుగారు | 5 0 0 |
| 36 | మ. రా. శ్రీ తోట రాజగోపాలరావు నాయుడుగారు | 5 0 0 |
| 37 | ,, పులపాక సుబ్బారావుగారు | 5 0 0 |
| 38 | ,, కె. సింహాద్రిరాజుగారు కంట్రాక్టర్ | 5 0 0 |
| 39 | ,, ఉప్పలపాటి రామరాజుగారు | 5 0 0 |
| 40 | ,, చాపరాల వెంకటనరసయ్యగారు | 5 0 0 |
| 41 | ,, ఇనుపకుతికల సుబ్బరామయ్యగారు | 5 0 0 |
| 42 | ,, దంటు పార్థసారధిగారు | 5 0 0 |
| 43 | శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవిగారు | 5 0 0 |
| 44 | మ. రా. శ్రీ సూరిపెద్ది కృష్ణమూర్తిగారు | 5 0 0 |
| | | 348 8 3 |

త్రాటోవరు 348 8 3

| | | | | | |
|---|---|---|---|---|---|
| 45 | మ. రా. శ్రీ కొప్పురావూరి సత్యనారాయణగారు | | 4 | 0 | 0 |
| 46 | ,, | వల్లూరు కేశవరావు చౌదరిగారు | 4 | 0 | 0 |
| 47 | ,, | నందిపాటి రంగనాయకులుగారు | 3 | 0 | 0 |
| 48 | ,, | గంగరాజు మల్లిఖార్జునరావుగారు | 3 | 0 | 0 |
| 49 | ,, | హోటల్ స్వతంత్రవారు | 3 | 0 | 0 |
| 50 | ,, | యడమ రామలింగంగారు | 3 | 0 | 0 |
| 51 | ,, | ఆంజనేయ సున్నంమిల్సువారు | 3 | 0 | 0 |
| 52 | ,, | కొత్తా సుబ్బారావుగారు | 3 | 0 | 0 |
| 53 | ,, | మల్లెల శోభనాచలపతి చక్రవర్తిగారు | 3 | 0 | 0 |
| 54 | ,, | వెల్కం హోటల్ పి. లక్ష్మణరావుగారు | 3 | 0 | 0 |
| 55 | ,, | సంకా నరసింహారావుగారు | 3 | 0 | 0 |
| 56 | ,, | చిట్టూరి రామకృష్ణయ్యగారు | 3 | 0 | 0 |
| 57 | ,, | దుర్గాకళామందిరమువారు | 3 | 0 | 0 |
| 58 | ,, | బూరగడ్డ వెంకటనరసింహారావుగారు | 2 | 0 | 0 |
| 59 | ,, | ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు | 2 | 0 | 0 |
| 60 | ,, | శిరిపురపు కోటేశ్వరరావుగారు | 2 | 0 | 0 |
| 61 | ,, | యం. యస్. రాజుగారు | 2 | 0 | 0 |
| 62 | ,, | అమ్మనబ్రోలు ప్రసాదరావుగారు | 2 | 0 | 0 |
| | | | 399 | 8 | 3 |

| | | |
|---|---|---|
| | ౹బాటోవరు | 399 8 3 |
| 63 | మ రా. శ్రీ పి. అక్కయ్యగారు | 2 0 0 |
| 64 | ,, కస్తూరి బ్రదర్సువారు | 2 0 0 |
| 65 | ,, బాయన పాపయ్యపాత్రుడుగారు | 2 0 0 |
| 66 | ,, జి. వెంకటప్పయ్యగారు | 2 0 0 |
| 67 | ,, డాక్టర్ జంధ్యాల దక్షిణామూర్తిగారు | 2 0 0 |
| 68 | ,, ఇవటూరి కోటేశ్వరరావుగారు | 2 0 0 |
| 69 | ,, పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘము | 2 0 0 |
| 70 | జనాబ్ సయ్యద్ సాలారుద్దీ సాహెబుగారు | 2 0 0 |
| 71 | మ. రా. శ్రీ పులిపాటి సుబ్బారావుగారు | 2 0 0 |
| 72 | ,, సూరాబత్తుల రామమూర్తిగారు | 2 0 0 |
| 73 | ,, కె. వి. కృష్ణారావుగారు | 2 0 0 |
| 74 | ,, యల్. వెంకటేశ్వరరావుగారు | 2 0 0 |
| 75 | ,, శృంగవరపు నరసింహంగారు | 2 0 0 |
| 76 | ,, నందూరి వీరభద్రరాయశర్మపాకయాజిగారు | 2 0 0 |
| 77 | ,, పిడికిటి రామకోటయ్యచౌదరిచారు | 2 0 0 |
| 78 | ,, జనాబ్ మహమ్మద్ యిబ్రహీంసాహెబ్‌గారు | 2 0 0 |
| 79 | ,, ముక్తేవి రామానుజాచారిగారు | 2 0 0 |
| 80 | ,, రామాటాకీస్ వారు | 2 0 0 |
| | | 435 8 3 |

| | | | |
|---|---|---|---|
| | | త్రాటోవరు | 435 8 3 |
| 81 | మ.రా.శ్రీ | కోగంటి రంగారావు చౌదరిగారు | 2 0 0 |
| 82 | ,, | చాపరాల సుబ్బారావుగారు | 2 0 0 |
| 83 | ,, | చోడవరపు విశ్వేశ్వరరావుగారు | 2 0 0 |
| 84 | ,, | గట్టి పెంటయ్యగారు | 2 0 0 |
| 85 | ,, | హరిమానికు హనుమోజీగారు | 2 0 0 |
| 86 | ,, | కంభంపాటి సుబ్బరామశాస్త్రిగారు | 2 0 0 |
| 87 | ,, | శ్రీపతి లక్ష్మీపతిరావుగారు | 2 0 0 |
| 88 | ,, | మద్దాలి జయరామారావుగారు | 2 0 0 |
| 89 | ,, | వి. వి. శాస్త్రిగారు (కళ్ళజోళ్ళషాపు) | 2 0 0 |
| 90 | ,, | కె. రాజగోపాల ప్రసాద్‌గారు | 2 0 0 |
| 91 | ,, | యన్. నరసింహులునాయుడుగారు | 2 0 0 |
| 92 | ,, | N. రామకృష్ణయ్యగారి కు॥ రామయ్యగారు | 1 0 3 |
| 93 | ,, | కూరాడ వెంకటసుబ్బారావుగారు | 1 0 0 |
| 94 | ,, | తాడేపల్లి వేణుగోపాలరావుగారు | 1 0 0 |
| 95 | ,, | కె. వి. పురుషోత్తంగారు | 1 0 0 |
| 96 | ,, | కె. సుబ్బారెడ్డిగారు | 1 0 0 |
| 97 | ,, | యస్. రామకృష్ణనాయుడుగారు | 1 0 0 |
| 98 | ,, | ఎ. వెంకటరావుగారు | 1 0 0 |
| | | | 464 8 6 |

| | | |
|---|---|---|
| | వ్రాటోవరు | 434 8 6 |
| 99 | మ. రా. శ్రీ సాదు వెంకటరంగయ్యగారు | 1 0 0 |
| 100 | జనాబ్ అబ్దుల్ మజీద్ సాహెబ్‌గారు | 1 0 0 |
| 101 | ,, షేక్ మీరాసాహెబ్‌గారు | 1 0 0 |
| 102 | ,, మినర్వా వాచ్ కంపెనీవారు | 1 0 0 |
| 103 | మ రా. శ్రీ దుర్గా ఖద్దర్ భాండార్‌వారు | 1 0 0 |
| 104 | ,, కె. సూర్యనారాయణవర్మగారు | 1 0 0 |
| 105 | ,, బొడ్డుపల్లి సాంబమూర్తిగారు | 1 0 0 |
| 106 | ,, రాజా ఓ. కె. స్టోర్సువారు | 1 0 0 |
| 107 | ,, నంబూరి బాపనయ్యగారు | 1 0 0 |
| 108 | ,, తురగా వేంకటరావుగారు | 1 0 0 |
| 109 | ,, ది ఓరియంట్ పబ్లిషింగ్ కో వారు | 1 0 0 |
| 110 | ,, టి. రంగయ్యగారు | 1 0 0 |
| 111 | ,, పిపపాటి సీతారామస్వామిగారు | 1 0 0 |
| 112 | ,, యద్దనపూడి రామబ్రహ్మంగారు | 1 0 0 |
| 113 | ,, సత్యనారాయణ విలాస్ వారు | 1 0 0 |
| 114 | ,, గోపు శేషావతారంగారు | 1 0 0 |
| 115 | ,, కె. యస్. యస్. మూర్తిగారు | 1 0 0 |
| 116 | ,, డాక్టర్ కంభంమెట్టు విష్ణువర్ధనరావుగారు | 1 0 0 |
| | | 482 8 6 |

| | | | |
|---|---|---|---|
| | | ౖౘటోవరు | 482 8 6 |
| 117 | మ. రా. శ్రీ | ముంజులూరి శేషగిరిరావుగారు | 1 0 0 |
| 118 | ,, | వి సుబ్రహ్మణ్యంగారు | 1 0 0 |
| 119 | ,, | కుదరవల్లి ప్రసన్న వీరరాఘవయ్యగారు | 1 0 0 |
| 120 | ,, | నంబూరి సుబ్బారావుగారు | 1 0 0 |
| 121 | ,, | యల్. రామమూర్తిగారు | 1 0 0 |
| 122 | ,, | పోతిన గణపతిరావు పాత్రుడుగారు | 1 0 0 |
| 123 | ,, | పి. సాంబమూర్తిగారు | 1 0 0 |
| 124 | ,, | చల్లా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | 1 0 0 |
| 125 | ,, | మాస్టర్ పైలర్‌గారు | 1 0 0 |
| 126 | ,, | పసుమర్తి సీతారామశాస్త్రిగారు | 1 0 0 |
| 127 | ,, | రాధాకృష్ణా షు స్టోర్సువారు | 1 0 0 |
| 128 | ,, | టి. వి. రాములు; సికింద్రాబాద్ వారు | 1 0 0 |
| 129 | ,, | కోటగిరి బ్రహ్మారావుగారు | 1 0 0 |
| 130 | ,, | మొక్కపాటి సాంబమూర్తిగారు | 1 0 0 |
| 131 | ,, | ఎ. వి. రామచంద్రరెడ్డిగారు | 1 0 0 |
| 132 | ,, | గోవిందరాజు వేంకటేశ్వరరావుగారు | 1 0 0 |
| 133 | ,, | యం. కోటేశ్వరరావుగారు | 1 0 0 |
| 134 | ,, | వేంకటేశ్వర ఫ్లోర్ అండ్ కాఫీ మిల్సువారు | 1 0 0 |
| | | మొత్తం | 500 8 6 |